# వెలుగు నీడలు

[కథల సంపుటి]

పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు

8 అ

లక్ష్మీగ్రంథప్రచారిణి

పిల్లలమఱ్ఱి

— కవివే —

మధుకణములు

(గేయసంపుటి)

చిత్ర (ఏకాంక రూపకము)

# వెలుగు నీడలు

[ కథల సంపుటి ]

పిల్లలమఱ్ఱి
వేంకట హనుమంతరావు

లక్ష్మీ గ్రంథ ప్రచారిణి
:: తెనాలి ::

## అర్పణము

వసుమతిలోని
వెలుగు, నీడలను
విప్పి చూపిన
**జననీ జనకులకు**

## త్రికము :

అ. సంఘంలోగాని, వ్యక్తిలోగాని, ఉన్న వెలుగును, నీడను వితర్కించి వివరించడమే యీ రచనల ఉద్దేశము.

ఈ. ఇదివరలో వివిధ పత్రికలలో ప్రకటితాలైన రచనలే, ఈ రూపం తాల్చి నవి.

ఏ. వీనిని ప్రకటించిన శ్రీ లక్ష్మీ గ్రంథ ప్రచారిణీ వారికి కృతజ్ఞత ఇదే తెలుపుతున్నాను.

పి. వేం. హ.

దీపావళి ; చిత్రభాను.

# సంస్మృతి

## ౧

పల్లెటూరి నివాసమంటే నాకు చాలా సరదా. నా చిన్నతనంలో నా కబ్బిందా సౌఖ్యం. ఇప్పటికీ జ్ఞాపకానికి వస్తూ ఉంటాయి పల్లెటూరనంగానే, నా చిన్నతనపు చేష్టలు. మళ్లీ ఎప్పుడైనా వెళ్ళుదామనుకొంటా. కార్తీకమాసంలో మా యింటి దగ్గరే ఉన్న శివాలయంలో ముత్తయిదువులు పెట్టే దీపాల్లో చమురుపోసే రోజులు వెళ్లినై. ఆషాఢ మాసంలో వైష్ణవాలయంలో దధ్యోజనం పెట్టున్నారంటే పరుగెత్తే రోజులు పోయినై. చైత్రమాసంలో శ్రీరామనవమి నాడు యింట్లో నలుగురం పోట్లాడుకొని చివరకు చెంబు తీసికోటంలో గెలిచి, పానకం పోయించుకొచ్చుకునే దినాలు, దాటినై. కొబ్బరి, వడపప్పుకోసం పోట్లాడుకునే రోజులు వెళ్ళాయి. "బల్ చెడుగుడు" ఆడే రోజులు మళ్ళీ రావుగా-వస్తాయనుకుందాం. వస్తేమటుకూ చిన్నతనం రావద్దూ ? లేకపోతే నవ్వరూ ? పెద్దవాడు పిల్లలతో ఆడుకొని పోట్లాడడంచూసి ఎక్కిరించరూ ? చిన్నప్పుడున్న "లైసెన్సు" యిప్పుడువస్తుందా ? కానీ, యిప్పటికీ పల్లెటూరంటే ఉండవలెనని బుద్ధి పుట్టుతుంది !

పరీక్షలు కాగేనే మా శర్మ తాను వేసికొన్న ప్రోగ్రాము పకారం, వాళ్ళ ఊరికి వెళ్లుదామని హెచ్చరించాడు.

ఊరంటే తలుచుకున్న కాసేపూ చిన్నవాడినౌతూఉంటా. వాడనటం ఆలస్యంగా అందుకున్నా "సరేనోయి" అని.

ఆ మర్నాడే రైలెక్కాం. రైలు, పొలాల్లోనుంచి దారిజేసుకొని తనిఖీ చేయటానికి వచ్చే పెద్ద మనిషిలాగ బుసలు కొట్టుతూ నడుస్తోంది. దానిని చూసి భయపడిన వానివలె చెట్లూ పర్వతాలూ వెనుకంగ వెస్తున్నాయి. వీరుడు లాగ బయల్దేరింది రైలు. "నా మహిమ తెలియగలరా... ...నా ధాటి కోర్వగలరా" అంటూ గర్వం రైలుగాడికి. "వెధవా, నీ గర్వం అణుస్తానం"టూన్నదో యన్నట్లు సిగ్నల్ చేయిజాపింది, "జాగ్రత్త" అని. పాపం రైలుగాడికి భయం వేసింది కాబోలు! వెంటనే ఆగాడు. "ఈ గర్వపోతుతో మనం ఎందుకు? అవతలకు తొలుగుదామ"న్నట్లు మా శర్మ అక్కడే దిగాడు. వాణ్ణి అనుకరించాను నేనూ. పాపం మమ్మల్ని వదిలినందుకు గాబోలు నిట్టూర్పు విడిచి వెళ్ళింది రైలు! ఆగిన చోటువక చిన్నస్టేషను. మేము బయలుదేరి వెళ్ళుతుంటే మాటికెట్టు నడిగినవాడే లేడు! గేటు పక్కకు చూసి "ఇక్కడేమీ విగ్రహం వుండదేంరా?" అన్నా శర్మతో. "నే నెప్పుడూ టికెట్టు లేకుండా వస్తూంటా నురా! నీకేం తెలుసు?" అన్నాడు వాడు. బండి అనేది లేదు ఆ సమీపంలో. శర్మమటుకూ వెళ్లుతున్నాడు, బండే మన్నా దొరుకుతుందేమో అని. ఇంతలోకే దొరికింది వకటి. వాళ్ళవూళ్ళో వాడిదే రెండెడ్ల బండి. జల్ల వేసివుంది. దానిని చూసేటప్పటికి నా చిన్నతనంలో మాపొలాల కెరువు పోస్తూ న్నప్పుడు, నేను బండిని తోలిన దృశ్యం జ్ఞాపకానికివచ్చింది!

కాసేపు అల్లాగే నిలుచున్నా. శర్మా, నేనూ ఎక్కి కూర్చున్నాము. బండివాడు పాపం, వాని పుణ్యాన, గడ్డి వేశాడు మెత్తగా ఉండానికి కాబోలు జల్లలో. శర్మ వాని చిన్నతనపు చేష్టలను ఆయా ప్రదేశాలల్లో చెప్పుతూ సంతోషిస్తున్నాడు. కొన్ని మారిపోయినై. బండివాణ్ణి పూరికే అడగడం మొదలెట్టాడు ఏమేమిటో ప్రశ్నలు. నేనుమాత్రం ప్రకృతితో మాట్లాడుతూ గడిపాను. ఇంతలోకే ఊరొచ్చింది! జల్లలో కూర్చున్నవాళ్ళము కాస్త నిలుచున్నాము. ఊరిబైటే బండి దిగాము యిద్దరమూ. పిల్ల లాడుకొంటున్నారు. వాళ్ళ వళ్ళంతా చవిటి మన్నుతో నిండిపోయింది. (నాటకాలేస్తు ఉన్నారు కాబోలు పౌడర్లతో.) అన్నీ పూరిగుడిసెలే. అగ్ని భయం ఉండదనే ధైర్యాన్ని చెప్పుతోంది. (ఉన్నదంటే ఊరంతా భగ్గుమంటుందిగా!)-మేము వెళ్లేసరికి మాతో తోడుగా వచ్చిన సూర్యుడు "గమ్యస్థానం చేరారుగా! ఇంకా నేనువెళ్తా" నంటూ మాయ మయ్యాడు. శర్మ, నిరుడు ఈ రోజుల్లోఉన్న ఊరుమాదిరి లేదని విచారిస్తూ దీనంగా సూర్యునివేపు చూశాడు. ఆ పడమటికొండ సూర్య కాంతి లేకపోవడంచేత విచార సూచకంగా నలుపురంగును వ్యక్తపఱచింది. ఒక్కమాటు వాయుదేవుడు "నేనున్నా, మార్పు కలగలేదు నాలో" అన్నట్లు విజృంభించాడు. నడుస్తూఉండగా, శర్మనూ నన్నూ ఒకయిల్లు ఆహ్వానించింది! లోపలికి వెళ్ళగానే శర్మను చుట్టివేసికున్నారు ఇంతవాళ్లూ అంతవాళ్లూ- "అన్నయ్యొచ్చాడేలమ్మా" అని అంటూ. శర్మ చేతిలో సంచి కాస్త మాయమైంది. మాకన్న ముందే

సంచీ ఇంట్లోకి వెళ్ళింది. ఆ దృశ్యం చూసేసరికి నా మన స్సులో నేను కళ్ళనీళ్ళు పెట్టుకున్నా కాస్త. "నాకూ-డా తమ్ముడుండి చుట్టేసుకుంటే బాగుండేదిగా" అని అను కున్నా......... రాత్రి గడిచింది.

౨

మర్నాడు ఉదయాన్నే శర్మ నన్ను తీసికొనివెళ్ళాడు, వాళ్ల పొలాలు చూపించడానికి. పల్లెటూరి సౌఖ్యం అంతా అనుభవిస్తున్నవి ఆ పొలాలు. పచ్చని రంగుతో పాలింపబడే ఆపైరును చూస్తూ ఉంటే నా హృదయంలో ఆనందం ఉబికింది. పొలాల గట్లమీద ఉండే పిల్లిపెసర కాయలు తెంపుకునే రోజులు జ్ఞాపకానికి వచ్చినై. ఆ సౌఖ్యాన్ని అనుభవిద్దామని చెరొక రెండు కాయల్ని కోసుకున్నా మిద్దరం! అక్క-డక్క-డ ఉన్నాయి పెద్ద కొబ్బరి తోటలు. గాలికి అల్లల్లా డుతూ రమ్మని ఆహ్వానిస్తున్నయ్యా అన్నట్లు ఉన్నవి కొబ్బరి చెట్లు; ఆకు లనే చేతుల్తో (గాలిచేత) "కొబ్బరి బొండా ల్నిస్తా రా! రా!" అన్నట్లు చెట్లు సంజ్ఞ చేస్తున్నాయి. పాపం మమ్మల్ని చూస్తే యెందుకో వాటి కంత ప్రేమ? ఇంతలోకే సమీపించాము గోదావరిని. ప్రకృతి అంతా మమ్మల్ని ఆహ్వానిస్తున్నది. పట్నాల్లో ఉంటే మనమొఖాల్ని చూసే వాళ్ళే లేరు.........!

ఆ నాడు పౌర్ణమి. గోదావరీ దేవి తన కుమారు డొస్తా డనే సంతోషంతో నూత్న శోభ దాల్చింది. మా మాదిరే చాలా మంది వచ్చారక్క-డికి. పునిస్త్రీ లంతా

పసుపు కుంకుమలనూ పూలనూ తీసికోని బిందెల్ని చంక నెట్టుకొని పెద్ద ముత్తయిదువైన గోదావరీదేవి సాన్నిధ్యానికి కాబోలు వస్తున్నారు. ఈ స్త్రీల సోదరీ భావాల్ని చూడ డానికి కాబోలు పద్మ బాంధవుడు తొంగి తొంగి చూస్తు న్నాడు, తూర్పు కొండ చాటున దాక్కొని. అక్కడున్న యిసుక తిన్నెలపైన మంచు బిందువులను సూర్యుడు వజ్రాల మాదిరి చేశాడు తన దృష్టులను ప్రసరింపజేసి. గోదావరీదేవి తన భర్తయైన సముద్రుని దగ్గరనుంచి రత్నాల్ని తెచ్చి వెద జల్లుకున్న దనేటట్లున్నై, ఆ మంచు బిందువులు. కుమారు డొస్తాడనే సంతోషంతో నృత్యం చేస్తున్నది గోదావరి. ఆ అలలు ముంగురుల్లా అగపడ్డవి. ఇంతలోకే గజ మెత్తు గబ గబా పాకాడు తూర్పు కొండమీద దివాకరుడు. ఆడవా ళ్ళంతా స్నానాలు చేసి తడిబట్టలలో బుజాలమీద బింద లెట్టుకొని లోకాభిరామాయణం మాట్లాడుకుంటూ వెళ్ళు తున్నారు. వెనుకపడ్డవారు - "ఉండర్రో! మేమూ వచ్చే దాకా ఉండర్రో!" అంటూ గబ గబా నడుస్తున్నారు. బ్రాహ్మలు అంగోస్త్రాల్ని కట్టి స్నానాలు చేసి, వీభూది ఇంత పూసుకోని మొఖాలకి, పిలక జుట్లను ఝాడించుకొంటూ వేదాలు చదువుతున్నారు. కొందరు సంధ్యలు వారుస్తున్నారు. తీర మంతా సందడిగా ఉంది. కాస్సేపట్లో అందరూ ఎవరి దారిన వాళ్లు వెళ్ళారు. మేము స్నానం చేశాము. ఎవ్వరూ లేరే అని చూశాము. గోదావరి ఉన్న దంటే, ఆవిడ ముత్త యిదువుల మాటలు విందామనో, లేకపోతే, బ్రాహ్మల పిల్లలు వల్లె వేస్తున్న మంత్రాల్ని విని పుణ్యం గట్టుకొందా

మనో, పరుగెత్తుతున్నది వారి వేపే. నాకు శర్మా - వాడికి నేనూ మిగిలాం. సూర్యమన్నా దంటే, పరుగెత్తుతున్నా డేమిటో మించిపోతున్నట్టుగా. (కొత్తపెళ్ళికొడుకు కత్తవా రింటి కెళ్ళేమాదిరి.) "ఆగవోయి! మేమూ వస్తున్నా" మన్నాం—ఊహూ—కోపం వచ్చింది మాకు. ఇంటికి వెళ్ళి భోజనంతో అణగ్గొట్టాం కోపాన్ని.

మధ్యాహ్న మంతా పిల్లలతో సరిపోయింది. మా శర్మకు తీరికే లేదు. కథలు చెప్పమనీ, పద్యాలు పాడమనీ-ఊ—విసుగెత్తేదాకా చెప్పించారు శర్మచేత. బలే సరదాగా ఉన్నదిలే. వాడి వంతైన తర్వాత నావంతు. ఇట్లా సాయంత్రి మొచ్చేదాకా గడిపాం. పిల్లల ప్రశ్నలకూ, వాళ్ళ అమాయ కత్వానికీ, నవ్వలేక నవ్వలేక, శర్మ వాళ్ళమ్మ దగ్గరకు పంపాడు వాళ్లని. పాపం వాళ్ళమ్మ పిల్లలు మాదగ్గరున్నారు గదా అనే నిశ్చింతతో ఫలహారం తయారుచేస్తున్నది. అమ్మ దగ్గరకు వెళ్ళమనిమాట సామెతగా పంపేసరికి వంటయింట్లోకి వెళ్ళి కలేబడ్డారు తల్లిపైనా, గారెలపైనా! చిన్నమ్మాయి మెటికలు విరుస్తున్నది. శారద (పసిది) తల్లి వొళ్ళో పడుకొని పాల్తాగుతూ తన అక్కల్నీ అన్నల్నీ వెక్కిరిస్తూ ఉన్నట్లు చూస్తున్నది సంతృప్తిజెందిన నేత్రాలతో. రాధాయి గొడ్ల సావట్లోకివెళ్ళి, జనప కట్టల్లో వకపుల్లను లాక్కొనివచ్చి, తల్లిని, పెట్టకపోతే కొట్టానంటూ నిల్చున్నాడు. సత్యం, పెద్ద ధర్మమూర్తిలాగా, వక మూల కోరచూపులు చూస్తూ నిలుచున్నాడు. ఏమిటా గోలని మేము చూట్టానికివెళితే రాముడొక గారెను నవుల్తూ మమ్మల్ని చూశి దొడ్లోకి పరు

గెత్తాడు. వాడొక్కడే తింటున్నాడనే ఏడుపు కొట్టిందికాబోలు. పరుగెత్తుతూంటే, చేతులో ఉన్న సగము గారె తలుపుకు చేయికొట్టుకొని కింద పడిపోయింది! అందరి మొఖాలూ చాలా దీనంగా ఉన్నాయి. శర్మ యేమిచేస్తాడో చూశాను. పాపం యేమీ మాట్లాడకుండా కొంచెమాగి "పిండివంట యిక చాల్లేవే అమ్మా-అయినంతవఱకు మాకు పెట్టేసేయి-వెధవల్లారా! పదండి నడవలోకి!" అనంటూ పిల్లల్ని పంపాడు వంటయింట్లోనుంచి—

3

ఫలహారము కావించుకొని బయల్దేరాము బలాదూరు. ఎక్కడికివెళ్ళినా నేను "ఆకొండను చూడరా, పొలాలు చూడరా" అంటూ ఊరికేవాణ్ణి అడుగుతూ ఉంటాను కాబట్టి, శర్మ నన్ను కవిత్వపు గోడ వేగాని, వేరేమీచూడనని మొద్దేవా చేస్తూ, తాను ఉదయాన గొప్పదృశ్యంచూశానని చెప్పాడు-"అన్నట్టు - పొద్దునవోట్ చెయ్యమన్నావు అదేనేమిట్రా" అన్నాను. మామాటలెవ్వరూ వినగూడదని గాబోలు ఊర పిచ్చికలు, కాకులూ కలకలా గోలచేస్తూ, గూళ్ళను చేరుతున్నాయి. పూర్ణ చంద్రుడు గబగబా పరుగెత్తుకు వచ్చాడు... నేనేదో వాడుచెప్పినట్లే గోదావరినీ యిసుకల్నీ చూస్తూంటే, వాడు లతను చూశాట్ట, "లతలెక్కడున్నైరా"? అంటే, "వోరీ, నీకవిత్వమింతేనా? స్త్రీలను లతలకు పోల్చర్రా?" అన్నాడు. "అయితే, ఏం జరిగిందేమి ట"న్నా. ఆపాట, తానూ, లతా చిన్నప్పటిస్నేహితులనీ, పెద్దైనతర్వాత

అంత వరకూ మళ్ళీ చూడలేదనీ చెప్తూతూ ప్రసంగం చాలించాడు.

ఇంతలోకే కొబ్బరితోటలోకి వెళ్ళాము. అది శర్మా వాళ్ళదే. అక్కడఉన్న జీతగాళ్ళచేత చెరొక బొండాన్ని కోయించుకొని సేవించాం. పైనున్న ఉత్తరీయం తీసి యిసుకపై పఱచి పడుకున్నాం కాస్సేపు. ఆ కొబ్బరి చెట్ల ఆకులలోనుంచి తొంగిచూస్తూన్నాడు చంద్రుడు. నిర్మలంగావున్న ఆకాశంలో సంచరిస్తున్నాడు. "కవిత్వం కట్టరా-హాయిగాఉంది. ఇంతకన్నా సమయం యింకెప్పుడురా" అన్నాడు శర్మ. అయితే వినరా అంటూ మొదలెట్టాను:

కలువ చెలికాఁడ వగుచును కల్మితమ్ముఁ
డగుచుఁ, గూర్చు మఱందివై యలరు త్రివిక్ర
మునకు; మామవౌదువు జగమునకు నీవు,
నీకు గానివా రెవరోయి! నీరజారి!

దీనిని విన్నాడు కాబోలు చంద్రుడు. పాపం కొబ్బరిచెట్టుదాటి గబగబా యివతలకొచ్చాడు. నిజంగా జగానికంతకీ మామ గదా! యింతమంది కూతుళ్ళ నెక్కడనుంచి తెస్తాడో! నేను పాడిన గీతం విన్నది మాకు దూరంగావున్న మరోకవి. నామీద పాడరూ అంటూ కేకేసింది -"కో"- యని. దానికి జవాబివ్వడం శర్మవంతు. "ఏంరా, జవాబివ్వరా శర్మా!" అన్నా. ఆలోచిస్తున్నాడు:

అలయింపకే - కోకిలా - అలయింపకే
అలయించి - కోకిలా - విలపింపజేయకే.

పంకువెన్నెల్లోన
యిసుకతిన్నెల్లోన
గుంపుకన్నెల్లోని
యింపుచిన్నెలదాని
మనసుచూరగొన
అలయింపకే - కోకిలా - అలయింపకే
అలయించి - కోకిలా - విలపింపజేయకే.
వినిపింపకే - కూత
కనుపింపకే - యెదుట
జనియించునే - ప్రేమ
కనుపించునే - మూర్తి.
అలయింపకే - కోకిలా - అలయింపకే
అలయించి - కోకిలా - విలపింపజేయకే

అని బదులు పలాకాడు శర్మ ! సామాన్యుడు కాడు సుమా!! లత బాగానే పెనవేసుకుంది ఇతనికి !!! ఆ పాట రంగం చాలించి యింటి వైపు దారిబట్టాం... ...

"కొబ్బరితోటలో ఉన్నప్పుడొచ్చినట్లు రమ్మను కవిత్వాన్ని పుకు. అవును కాని, వరే, నాగీతం ఏట్లాఉందిరా?" అన్నాడు శర్మ. బాగానే ఉన్నదన్నాను యేడ్చినోతాడన్నట్టుగా. "శర్మ! లత సంగతి చెప్తూతూ ఆపేశావు సరిగ్గా చెప్పవురా?" అన్నా. "అన్నట్టు, చెపుదామనుకున్నారా. లతా నేనూ బాల్యస్నేహితులం. నేను ఫష్టుఫారం చదువుతున్నప్పుడైంది ఆ అమ్మాయి పెళ్ళి. అప్పటికి బి. యే., చదువుతున్నాడు పెనిమిటి. మూడు సంవత్సరాల క్రితం అత్త

వారింటికి పంపుదామనివుత్తరం రాస్తే బియ్యే ప్యాసయిందాక పంపొద్దని జవాబొచ్చింది. ఇప్పటికీ ఆయన ప్యాసుకాలేదు. ఆ అమ్మాయి పుట్టింట చేసే చాకిరి యింతా అంతా అని చెప్పలేము. రోజూ చాకిరేవుకు తెచ్చే దానిలాగ ఒకపెద్ద మూట తీసుకొస్తుంది, గోదావరికి ఉతకటానికి. ఇంట్లో పని మనిషే లేదుగద! ఇంక చెప్పేదేమున్న దావిడ సౌఖ్యాన్ని గూర్చి!" అని దీనస్వరంతో చెప్పుకొచ్చాడు. శర్మకళ్ళల్లో కళ, "తానే భర్త ఐతే యెంత సుఖపెట్టేవాణ్ణో" అన్నట్లు వ్యక్తపఱచింది. ఇంతట్లోకే ఊళ్ళోకొచ్చాము. వెన్నెట్లో తమ్ముళ్ళకు కాబోలు అన్నం కలిపి పెట్టుతూ చిన్నిచెల్లెల్ని చంకనెట్టుకొని, "చందమామ రావే - జాబిల్లిరావే" అంటూ తిరుగుతూ ఉంది రోడ్డుమీది కగుపడ్తూ వక అమ్మాయి. అటువైపుచూపించి శర్మ, "అదేరా లతయిల్లు! చూశావు కాదూ!" అనిన ఆలస్యం లేకండా, ఆవిడ లోపలికి వెళ్లింది...

మేము యింటికివచ్చి త్వరగా భోంచేసి వెన్నెట్లో మంచాలువేసికొని పడుకున్నాము. మాపక్కనే పిల్ల లంతకు మునుపే పడుకొని నిద్రపోయినారు. వాళ్ళ అమ్మ దొడ్లో తిన్నచెయ్యి కడుక్కొంటూ, "శర్మా! పిల్లలంతా నిద్ర పోయ్యార్రా! అని అడిగింది, గోల అణిగిందిగదా అనే తృప్తితో— శర్మ "ఆ" అన్నాడు లతపైనున్న మనస్సును అటుతిప్పి. ఆరాత్రల్లా నాకా లత సంగతి జాలేసి సరిగ్గా నిద్రపట్టలా. మాశర్మ సంగతి చెప్పనక్కర్లేదు. భావగీతా లల్లుతున్నాడు!

# ౪

తెల్లవారింది. యథాప్రకారం గోదావరికే వెళ్లాము నేనూ శర్మా. పాపం లత రాలేదప్పటికి. స్నానంచేసి వచ్చే శాముఇంటికి. శర్మ "బాదమాకులు తీసుకురారా" అని సత్యాన్ని పంపాడు. వాడితో పాటు బయలుదేరింది సైన్య మంతా. బాదంచెట్టు ఎక్కింది సత్యం ! కింద నిలుచుని ఉన్న పిల్లలు "బాదం కాయలు వెయ్యవ్రూ అన్నయ్యా" అంటూ బతిమాలుతున్నారు. పాపం, సత్యం చీమలతో యుద్ధం చేస్తూ, కిందికి రాల్చాడు కాయల్ని. ఎవరికందినవి వా రేసు కున్నారు. రాముడు "నాకసలు దొలకలేదులా అన్నయ్యా!" అనంటూ పిర్యాదు చేశాడు. అప్పుడు సత్యం చెట్టుదిగివచ్చిన తర్వాత, అన్నికాయల్ని సమానంగా పంచుకొని, బయలుదేరి వచ్చారు విజయం లభించిన వీరుల్లాగ! శర్మ తొందరగా నాల్గు విస్తళ్లు కుట్టేశాడు నేనూ నేర్చుకున్నా ఒకటికుట్టడం! పట్నాల్లో దొరకమను ఆకుల్ని ?......అందుకనే గ్రామ వాసం చౌక-మరి ఆరోగ్యంకూడా అంటారు......మూడు రోజులూ హాయిగా గడచిపోయినై.

భోజనానంతరం ప్రయాణమైనా పట్నానికి. వాళ్ళమ్మ "అప్పుడే పోతున్నా వేమయ్యా? సెలవలున్నాయి కాబోలు?" అన్నది. శర్మ "వెళ్ళాల్లే, వాడికి సంబంధం వచ్చింది" న్నాడు. "చాల్లేరా ఊరుకో" అంటూ "వెళ్ళొస్తాన"న్నా. పిల్లలూ పు కొనడానికి లతా వాళ్ళింటికి వెళ్ళారు. ఊరిబైటదాకా వచ్చాడు రాముడు పెత్తాత మాదిరి. శర్మా నేనూ బయలే

రాము స్టేషనుకు. లత మట్టుకు అగుపడ్డది మేము వెళ్ళేటప్పుడు. నాకళ్ళల్లో నీళ్ళొక్కమారు వచ్చినై ఊరువదలాల్సి వచ్చిందిగా అని. కొబ్బరి తోటవద్దకు వచ్చాము. మా గీతాలు జ్ఞాపకానికివచ్చినై. సరే - నడుస్తూ వెళ్తేనే బాగుంటుందనుకోని బయలుదేరాము......

స్టేషన్ దాకా వచ్చాడు పాపం శర్మ. రైల్లో ఎక్కించాడు - అంటే ఎక్కేదాకా నిలుచున్నాడు - తర్వాత శర్మ "ఉత్తరం వెయ్యి" మన్న ముక్క గార్డువిజిల్‌లో కలిసి పోయింది......

ఇప్పటికీ జ్ఞాపకానికివస్తూ ఉంటుందాఊరు, అక్కడి దృశ్యాలు - ఆ కొబ్బరి తోటలూ......ఆపొలాలూ...... మనస్సు కలతజెంది నపుడల్లా ఆసౌఖ్యాన్ని అనుభవిస్తూ ఉంటా తలుచుకోని.



# నా డ్రాయింగురూమ్!

చిన్నప్పటినుంచీ నాకుఉండేది మనసులో........

ఏంచేస్తాను? పరిస్థితులన్నీ సమకూడాలిగా? నా మటుకు నాకు వక ప్రత్యేకపు గది ఉండాలనీ, (ఈ సంకుచితమైన ప్రపంచాన్నుంచీ, బాధాపూరితమైన ప్రపంచాన్నుంచీ దూరంగా) ఎన్నాళ్ళనుంచో ప్రయత్నమూ, ఆశయమూను. చక్కగా ఎవరన్నా నాకోసమొస్తే కూచోడానికీ, నిశ్శబ్దంగా ఆలోచించుకోడానికి, తీయని భావాలు రావడానికీ, ఇంట్లో గడబిడల్ని బాహ్యంగా ఉంచడానికీ, ఉండాలి మరి! ఆ గదిలో నాల్గు సోఫాలూ, వక రౌండుటేబిలూ, వక పక్క పుస్తకాల బీరువా, మరోపక్క మేగజయిన్లు, గోడలకు మంచిమంచి చిత్రాలూ అమర్చాలనీ......ఇంకా ఎన్నెన్నో ఊహాసౌధాలు!

ఆశయమైతే గొప్పదే! అమలులోకి వచ్చేటప్పటికి ఆవుతుంది...ఐనా ప్రతి విషయంలో చిన్నప్పటినుంచీ మంచి పట్టుదల కలవాణ్ణి కాబట్టి నా ఆశయసిద్ధికి ఘట్టిగా యత్నించాను...

ఆశయం ఎప్పుడైతే కలిగిందో ఆనాటినుంచీ ప్రతి యింటికీ పోవడమూ, (అంటే పరిచయంకలిగిన గొప్ప ఇళ్లకే లెండి) వాళ్ళ డ్రాయింగు రూము ఎల్లాఉన్నాయో గమనించడమూ, అల్లాగే మా యింట్లోకూడా తయారుచేయాలని ఉర్రట్లూరడమూ, జరుగుతూ వచ్చాయి. కానీ, నాక్కూడా

జీవితంలో ఓ స్థాయి చిక్కాలనీ. ఆపైని అటువంటి హంగు లకు అవకాశముంటుందికాని, ఇట్లా నా మొహం నలుగురూ మెరక్కముందే, నా ఇంటికి పదిమంది పరిచయస్తులూ రాకముందే, ఏర్పరచుకోవడం ఏమిటా అని ఆలోచననేలేదు.

అసలవి అనవసరపు డాబుసరి రోజులు. అంటే రోడ్డు మీద తిరుగుతున్న వ్యక్తి, స్థితిగతులు అసలు బాగుండక పోయినా, బైటికి టాక్ టీక్‌గా సిల్కు-సూట్లలో అగుపించే రోజులు, ఆ పూటకి తిండి ఉన్నదా అనే ప్రశ్న లోపల వేధి స్తూన్నా, లోపల లొటారం, బైటికి పటారం! డబున్న వాళ్లూ లేనివాళ్ళూ ఒకేలాగా అగుపిస్తారు.

నేను ఊరూరా తిరిగి నాల్లుచోట్లలో చదువు పూర్తి చేయడంమూలానా, ఏర్పాట్లు చేసుకోవడం జరగలేదు. తర్వాత చేతనైనంతమటుకూ మెల్లెమెల్లగా వస్తువులన్నీ ఒక్కొక్కటే చేర్చాను.

వచ్చే కాస్తజీతమూ వీటికే సరిపోతున్నదనే దిగులు ఒక మూల బాధిస్తూవుండగా శాంతీ, నిశ్శబ్దం నాగదిలోమాత్రం ఎల్లా ఉంటాయి? నా పుస్తకాల బీరువాలోనుంచి కొన్ని పుస్తకాలు క్రమేపీ సంగ్రహింపబడ్డాయి—వచ్చే పొయ్యే వాళ్ళచేత.

నా గదిలో చిత్రాల్ని పిల్లలముందు పెట్టేది మా ఆవిడ 'బొమ్మలు' అని అంటూ. సోఫాలు చూద్దామా, "మీ నాన్న రూమ్‌లో కూచోండి ఎంచక్కా మెత్తగా ఉంటాయో చూడండి-పడవకండా కూచోండి అంటూ వాటిమీద కూచో బెట్టుతూ, ఉంటే కళ్ళారా అక్కడే ఉండి చూశాను. ఏమం

టాను —ఇంట్లో పిల్లలను సమదాయించడం నా సోఫాలవం తైనపుడు ? పోనీ అల్లాగైనా ఏడవకుండా ఉంటున్నా రను కున్నాను.

నా గదిలో పత్రికలన్నీ వంట ఇంట్లో మూకుళ్ళు గానూ, పచ్చడులమీద మూతలుగానూ, ఇంకా ఎన్నెన్నో పనులలో తాత్కాలికంగానూ, కొన్ని శాశ్వతంగానూ 'యాక్టు' చేస్తూండడము కనిపెట్టాను.

లెటరు పేపర్లు టేబిలుమీద పెట్టుకుంటే, వాటిలో కొన్నిటిని మా పిల్లలు ముందేసుకొని ముక్కు విరిగిపోయిన పెన్సిళ్ళతోనూ, పళ్ళు తోముకునే పుల్లలతోనూ, ఉమ్మి సిరాగా భావించి, పాపం వాళ్ళ తాతయ్యకూ, అమ్మమ్మకూ ఉత్తరాలు రాయడంలో ఖర్చవుతూ వచ్చాయి.

నా టేబిలుమీద ఫ్లవర్ వేసులో పెట్టుకున్న పూలూ, గకరకాల ఆకులూ, పిల్లల తలల్లోకో, దేవుడి (ఉత్తుత్త) తల మీదికో పోతూవచ్చాయి. రోజూ నా గదిలో వస్తువుల 'అట్టెండెన్సు' తీసుకోవడమూ, అవి చాలా భాగము 'ఆబ్సెంట్' అవుతూ ఉండడమూను.

*　　*　　*　　*

ఏదో తిన్నది అరక్క, పెద్దఆశయం పెట్టుకున్నాగానీ, మన ఇళ్ళల్లోనా డ్రాయింగ్ రూములు ! మా అమ్మాయి అవతలికి వెళితే నా రూమ్ "లావెటరీ" గా కూడా మారు తుందా కొకప్పుడు. విసుగెత్తి నాకు కునుకు పట్టిందంటే ఆ సోఫాలో, అదే "బెడ్‌రూమ్" అవుతుంది. అట్లా జరిగింది కూడా చాలా సార్లు.

ఫలహారాన్ని పిల్లలు చూస్తే జబ్బుచేస్తుంది. ఎక్కు-వగా కావా లంటారు. కాబట్టి మా ఆవిడ చాటుగా నా గది లోకి తెచ్చినప్పుడు అది "డైనింగ్ హాల్" గా మారేది... అస లా పేర్లు ఆ యూరోపియన్లకే సరిపోయింది గాని, మనకా?—

వాళ్ళ చదువులు చదివి, వాళ్ళలాగా ఉండా లని ప్రయత్నించే మనకు వాళ్ళ దేశాచారా లేమి గిట్టుతై? అతకబెట్టినట్లే ఉంటాయి. ఆ అతుకు లెల్లా బాధిస్తాయో చూశారుగా? హాయిగా మనవాళ్లు పడమటిల్లనీ, పంచపాళీ అనీ, నడవ అనీ... ఇం కే మేమిటో పేర్లతో అమర్చిన ఇళ్లు మన ఆచారాలకూ దేశానికీ చెందినవి ఉండగా, పులిని చూసి నక్క వాత పెట్టుతున్న ట్టీ 'డ్రాయింగు రూము' లేమిటి? యీ గొడవంతా ఏమిటి?

కొన్ని సామాన్లన్నీ వెంట నే ఆక్షన్లో పారేశి చక్కగా చిరిచాపలు నాల్గు కొన్నాను. ఎవ రొచ్చినా వాటి మీద కూచో పెట్టే వాణ్ణి. సోఫాలూ మొదలైనవి తీసివేసే టప్పటికి కొంత విశాలం ఏర్పడింది కూడా ఇంట్లో... ...

ఇప్పుడుమటుకూ నా 'డ్రాయింగ్ రూమ్' ఉన్న ప్రశాంతత యిదివర కెప్పుడూ లేదు. హిందూ గృహాల సౌభాగ్యమూ, కళా నా "డ్రాయింగు రూమ్" కు అలవడి నాయి... హాయిగా కర్టెన్లు తీసిపారేయటాన చల్లగా వేప చెట్టు గాలి ఎదటికి కొట్టూంటుంది.

వాకిలికి చక్కా పచ్చటి మామిడాకు తోరణాలు కట్టాను. సినిమా చిత్రాలూ ఇంగ్లీషు కాలండర్లూ తీసేసి

మా శాంతినికేతన స్నేహితుడు వేసి ఇచ్చిన "హిందూ చిత్రకళ" తో నా గది అలంకరించాను.

ఇంట్లోకి రాగానే మా ఆవిడ సంతృప్తి చెందిన నేత్రాలతో కాళ్లు కడుక్కోడానికి నీళ్లివ్వగానే ఎక్కడలేని సంతోషమూ కలుగుతుంది...

చూడవచ్చిన నా భ్రాంతా మా యిల్లూ, ప్రత్యేకించి నా "డ్రాయింగు రూమూ" చూసి సంతోషిస్తూ ఉంటారు.



# పెంపకము

ఎప్పుడో చిన్నప్పు డల్లరిచేశానని ఎప్పుడూ అల్లాగే ఉంటానని ఎట్లా అనుకుంటారు? అయినా పిల్లలంతా చిన్నతనంలో అల్లరిచేస్తారు. అల్లరి చేస్తేనే ముద్దూ, మురిపెమూ! లేకపోతే, బెల్లంకొట్టిన రాయిలాగా కూచుంటే ఎవ్వరూ దగ్గిరికి తీయరు సామాన్యంగా. చిన్నప్పుడు ఏపనిచేసినా చక్కగానే ఉంటుంది. తప్పైనా మన పెద్దవాళ్లు నవ్వి ఊరుకుంటారు. అంతే! దాంతో చనువు ఎక్కువయిపోతుంది. గారాబం పెరిగిపోతుంది. చివరికి పెద్దయినా వదలదు. అప్పుడు దెబ్బతింటాం. మగపిల్లలైతే పెద్దయినా అల్లరిగా ఉంటే ఫరవాలేదు. కాని ఆడపిల్లల కొస్తుంది ఎక్కడ లేని గొడవానూ. ఏం? మేము మటుకూ ఏంలోపం చేశాము ప్రపంచానికి? ఊహ తెలియకముందట్నుంచే ఎవరికో భయపడాలి. స్వేచ్ఛ అంటే పోతుంది. పది ఏళ్లుకూడా రాకమునుపే, నవ్వితే తప్పు, వాకిట్లోకి వెళ్ళితే తప్పు, గట్టిగా మాట్లాడితే తప్పు. ప్రతిదీ తప్పే. అదే ఆ యీడు మగపిల్లవాడైతే చెల్లుతుంది! ఏమిటీ అన్యాయం? నిజంగా లోకమంటే ఏమిటో సరిగా తెలియని స్థితిలో నిర్బంధాలేమిటి? అర్థంలేని నిర్బంధాలు!

మొత్తానికి నాకు పేరు వచ్చేసింది. ఎట్లా పోతుంది? చిన్నప్పు డల్లరిచేసేదాన్నిట-మా అమ్మ చెబుతూ ఉంటుంది. ఉండొచ్చు. కాని ఆవిడ కొట్టూ వచ్చేది. అది మటుకునాకు

బాగా జ్ఞాపకం. నేను మళ్ళీ ఎదురు తిరిగేదాన్ని. మా నాన్న గారు నిజంగా నాపక్షం వుంటూ ఉండేవారు కాబట్టినాకు ధైర్యం. ఇంట్లో మానాన్నా నేనూ ఒకటి; మా అమ్మ ఒక్కత్తే ఒకటి! మా అమ్మకూ నాకూ క్షణం పడేదికాదు. ఆవిడ చెప్పినమాట వినకపోవడం పరిపాటయిపోయింది నాకు. నేను-పోయిపోయి వాళ్లకు పుట్టడంమూలాన నామీద మా వాళ్ళ కెంతో ప్రేమ. మా అమ్మ "అబ్బో! గారాబపుబిడ్డ!" అని దెప్పుతూ ఉండేది మా నాన్నను!

మొత్తానికి నాకు మా నాన్నమాటంటే గురి అయి పోయింది. మా అమ్మతో వైరంకూడా అలవాటయింది. ఇట్లా ఉండటంలో మా నాన్నతోనే అన్నం తినడం, ఆయన ఇచ్చిన బట్టలేసుకోవడం, ఆయనతోటే సభలకు వెళ్ళడం, ఆయన చదువుకుంటూన్న సమయంలో చదువుకుంటూ ఉండడం-ఎదురుగా కూచోని, మొదలైనవన్నీ మా అమ్మకు మంటగా ఉండేవి. ఆవిడగోడవే వేరు!

"మరీ మొగపిల్లవాడివై పోతున్నావు! బొత్తిగా ఇవ తలచెంబు తీసి అవతల పెట్టకుండా వచ్చావు. చదువుల సరస్వతి అయిపోతున్నావు. చూడు, సీతమ్మగారి అమ్మాయి ఇంచక్కా తనంత తాను జడవేసుకుంటుంది. నూనె రాసు కోని స్నానం చేస్తుంది. చక్కగా పొన్నెమ్మమాదిరి ఎంతో ముచ్చటగా ఉంటుంది. వాళ్ళమ్మకు తోడుగా ఉంటుంది పనిపాటల్లో. పిల్లల్ని సముదాయిస్తుంది. ఎంతో సహాయ కారిగా ఉంటుం దాపిల్ల! నువ్వున్నావంటే దేనికి? నీ అంతట నువ్వు నీ పనులు చేసుకుంటే చాలు! నాకు పదివేలు!

తిన్న కంచమే కడుక్కోకుండా పరుగెత్తిపోతావు మీనాన్న గారితో. బాగా అలవాటు చేశారు. నిన్నని ఏమిప్రయోజనం? రేపొచ్చేవారికి ఏం జవాబు చెబుతానో, నాకైతే జవాబు చెప్పగలిగాను కాని! మరీ అంతగారాబమా? చిన్నపిల్లకు ఇప్పట్నుంచే నేర్పుతున్నారు నామీా దెక్కిమిరియాలు నూరడానికి!" అని ఒకటే సణుగుడు మా అమ్మ! నేను పెడచెవిని పెడుతూ ఉండేదాన్ని.

మా అమ్మవల్లే నేను అల్లరి పిల్లననే వదంతి పుట్టిందని నాకట్టి అనుమానం. ఎందుకంటే, ఆవిడ ఎప్పుడూ అందరికీ వెల్లడిచేయందీ (ఏవిషయమైనా) ఆవిడకు నిద్రపట్టదు. పని లేకపోయినా పని కల్పించుకొనైనా తనమనస్సులోది ఇతరులకు కక్కిరావడం ఆవిడ మతం. ఏముంది? ఆ అమ్మయీా అమ్మకు చెప్పనూ, ఈ అమ్మ ఆ అమ్మకు చెప్పనూ! మరో అమ్మ ముక్కు మీాద వేలేసుకొని 'అప్లాగుమమ్మా!' అని ఆశ్చర్య పోవడం. ఇల్లా పాకిపోతుంది విషయం. ఇంతా చేస్తే ఏమీా లేదు మళ్లీ—మొత్తానికి నా పేరు బైటికిరావడం తప్ప.

మావాళ్లు నన్ను గారాబంగా పెంచారు కాబట్టి నాకొకవాల్సినవన్నీ మా నాన్న సమకూర్చేవాడు. కాస్త కలవాళ్ల బిడ్డ నవడంచేత నాకు రకరకాల పరికిణీలూ, వోణీలూ ఉండేవి. వాటిదగ్గర వచ్చేది మా అమ్మకూ, నాకూ ఘర్షణ. ఆవిడ ఇచ్చినవి నాకు ఇష్టమయ్యేవికావు. మా నాన్నగారు నాకిష్టమైనవి తీసుకోమనేవారు. మా అమ్మ అనేది- "ఇక్కడైతే ఇష్టమొచ్చినట్టు జరుగుతుంది. రేపు

అక్కర్లేట్లాగో?" అని. మా అమ్మ పెద్దది కాబట్టి సర్దుకుపోవచ్చు. ఊహుఁ. అందుకనే గోల అయిపోయింది. నిజంగా చూస్తే నాదేమీ తప్పు లేదు. పెంచటం చాతకాకపోవడం ఆవిడదే తప్పు. అది మా నాన్నమీద కోపం చేత నామీద చూపించడం చేత ఇల్లా జరిగిందని నా అభిప్రాయం. గుట్టనేది మా అమ్మకు చాతగాదు.

మా నాన్నగారు నన్ను కోప్పడి ఎరగరు. అందుకనే నే నాయనమాటంటే శిలాశాసనంలాగ భావిస్తాను. నాకు చదువుకోవాలని అభిలాష బాగా ఉండేది. మా నాన్నగారు కూడా మొగపిల్లలు లేకపోవడంచేతనే కాబోలు నన్ను విద్యావతిగా చేయాలని సంకల్పించుకున్నారు. అందుకని పన్నెండేళ్ళొచ్చేదాక బళ్ళోకి వెళ్ళుతూ వచ్చాను. మా అమ్మకి నేను బళ్ళోకి వెళ్ళటం ఇష్టముండేది కాదు. "ఇంట్లో సంగీతం చెప్పిస్తున్నామాయెను, చాలదా? ఆడపిల్ల అని ఉందంటే ఆచారం లేకుండా చేస్తారా? చేతికింద కాస్త తోడుగా ఉండొద్దా? చదువులెందుకు? ఊళ్ళేలాలా, ఉద్యోగాలు చెయ్యాలా? నే నేం చదువుకున్నా నేమిటి? నాకు పెళ్ళికాలేదా? మీకు చేసుకోడం మానేశారా? రేపొచ్చే సంబంధాలు వెనక్కుపోతయ్యా? కాస్త పనీ, పాటా నేర్చుకోని ఉంటే నయం కాని, బళ్ళోకి పంపిస్తే ఏమిటి లాభం? వెళ్ళొచ్చిందిగా! చదువుకున్నంతమటుకూ చాలు! రోజూ పోట్లాటలు తీసుకురావడం దీనిపనీ, తీర్చడం మనపనీ అవుతున్నది. అంతకన్నా ఇది నేర్చుకున్నది నాకేం కనపడలా!" అని మా అమ్మవాదన.

మా అమ్మ ఎప్పుడూ పని చెప్పేది కాదు నాకు. అందువల్ల నేనేమీ వాటిజోలికి పోయి ఎరగను. అయినా, ఏమీ చెప్పకపోతే చాలనుకునేదాన్ని. లోపలనుంచి పిలిచినా వినపడనట్టు నటిస్తూ వచ్చాను. ఒకొక్కప్పుడు ఏమైనా పనిచేయమంటే దాన్ని నాశనం చేయడంమూలాన్ని నాకసలు పనే చెప్పేదికాదు. ఒకమాటు కాఫీ పొయ్యిమీదనుంచి దింపమంది తాను జడవేసుకుంటూ. నేను దింపబోతూ కాళ్ళమీద పోసుకున్నా! సీసా గూట్లో పెట్టి రమ్మంటే తొందరలో కింద పడేశాను!—ఇటువంటివిచూసే మాఅమ్మ నాకు పనిచెప్పడం మానేసింది! నాకూ నయమే అనుకున్నాను!

నన్నెప్పుడూ పెత్తనాలకు తీసికెళ్ళేది కాదు మా అమ్మ. తానైతే ఎప్పుడూ ఎవరో ఒకరింటికి వెళ్ళుతుంది. నేనొస్తానంటే వద్దనేది. అల్లరి చేస్తానని ఆవిడకు భయం. నేనల్లరిచేస్తే ఆవిడకు నామర్దా వస్తుందనికాబోలు! తను నన్నుగురించి చెప్పుకుంటే రాదుకామోసు! నిజంగా ఆవిడ నన్ను తనతో తీసికెళ్తూఉంటే ప్రపంచంసంగతి తెలుస్తుంది. తోటిపిల్లలెట్లా ఉంటున్నారో గ్రహించడానికీ, పొగతాయింపు తనాన్ని నేర్చుకోవడానికీ అవకాశా లుండేవి. ఏ వూరికివెళ్ళినా మా నాన్నగారిదగ్గరనే ఉంచి వెళ్తుతూఉండేది. నేను మా బంధువుల్నెవరినీ ఎరగను. ఇది ఎక్కడైనా కద్దా? కన్నపిల్లను ఇంట్లో అట్టే పెట్టిపోవడం! తల్లి వెళుతూంటే పిల్లను తీసికెళ్ళదూ? అదేమిటంటే, "అల్లరిపిల్ల — నే చెప్పిన మాట వినదు. నలుగురిలో నగుబాట్లు!" అని ఊరుకుం

టుంది!……ఇంతకూ నా ఖర్మ అల్లాఉంది. ఒకర్నంటే
ఏంలాభం?

పెళ్లి సంబంధాలొచ్చాయి. అందరూ చదువూ సంగీతం చూసేవాళ్ళేగాని పనీపాటా అడగలేదు. మావారే గెలిచాడు…… మొత్తానికి నా పెళ్ళి కావడానికి మటుకు సంగీతం చూసే అయింది. అందాకా ఎందుకు? నా అదృష్టమే అనుకోవాలి! మా అమ్మ భయానికి తావు లేకుండా పోయింది. అదీ నా కావాల్సింది.

* * * *

అవి మొదటి దినాలు కాబట్టి అట్టే నాకేమీ పని తగిలేది కాదు అత్తవారింట్లో. అదీగాక నన్ను ఆ ఇల్లాలు తన ఆడపిల్లలాగా చూచుకునేది. తనకూ ఒకటే మొగపిల్లవాడే మిగలటాన నన్నంత రొష్టు పెట్టి ఎరగదు, పాపం! చక్కగా ఇద్దర్నీ రెండుకళ్ళ మాదిరి చూసుకుంటూ వచ్చింది. నాకామె అంటే ఎంతో ఆపేక్ష కలిగింది. మా నాన్నగారి తర్వాత అంత చనువుగా, ఆపేక్షతో దగ్గిరికి తీసినవారు లేరు. మా అమ్మ పేరు తలుచుకుంటే భయమేసేది. ఎందుకు? ఆవిడ ఎప్పుడూ నాతో సంతోషంగా ఉండలేదు కాబట్టి.

పెళ్లి కాకముందు ఆగొడవా — అయిం తర్వాత అల్లుడుమీద కోపం నామీద చూపించడం! నాతో ఎన్నంటే ఏం లాభం? నేనైతే ఎవ్వరికీ ఏమి మాటలూ చెప్పేదాన్ని కాదు. మధ్య నాకెందుకు ఆ గొడవ? కాని, మా అమ్మ మటుకు ఒక్కమాటు నాతో ఎన్నడూ లేని ఆప్యాయంతో మాట్లాడింది. అది మా అత్తవారింటికి వచ్చే

టప్పుడు. నిజంగా ఆ క్షణం నాకు ఆశ్చర్యం, కన్నీరూ ఒకే మాటుగా వచ్చాయి. కన్నకడుపు పంటే అల్లా ఉంటుందని కామోసు. నాకూ— ఆవిడ చిన్నప్పటి నుంచీ ఎన్నన్నా— ఓవిధమైన జాలికలిగింది ఆవిడ మీద. నేను మా అత్తవారింటికి వచ్చేస్తే ఆవిడకు సంద డేదీ? నిజమే! ఆవిడ అన్న ముక్కలన్నీ సత్యమే... నా నన్ను ఎందుకు అల్లా రావా డేది?

చూసిన వాళ్ళంతా నన్ను "నాన్న నాన్న పోలికమ్మా! పట్టి బోళా మనిషి. గర్వం లేదు. నిజంగా నీ వదృష్టవంతురాలవమ్మా!" అనే వాళ్ళు మా అత్తగారితో... మా అత్తగారు నాకు మొదట్లోనే చెప్పేది ఏమేమిటో... అంటే, ఎవరింటో ఎల్లా మాట్లాడాలో అన్నీను. ఆ తర్వాత నేనూ, ఆవిడ కలిసి ఎక్కడికైనా — ఎవరింటికి పేరంటానికైనా— వెళ్ళేవాళ్ళం. నిజంగా నేర్పితే మటుకు నేను బుద్ధిమంతురాలను కానూ! ఆ లోపం మా అమ్మది కాని. మెల్లిగా పను లన్నీ చేయడం చాతయినై. పుట్టుతూనే రమ్మంటే వస్తాయా? వాటిని చేయించే పద్ధతికూడా తెలియాలి తల్లికి. ఊరికే కొట్టడమే అయితే పనులు ఎల్లా నేర్చుకునేది? మా అత్తగారికి ఆ విధానా లన్నీ బాగా తెలుసు కాబట్టే నా లోపా లేమీ బయటి వాళ్ళకు తెలియనీకుండా, గుంభనగా, నాకు పని పాటా నేర్పించింది క్రమేపీ. ఆవిడ మంచిది కాబట్టి అంత శ్రద్ధ తీసుకుంది. ఇంకోరైతే "పనులు నేర్పి పంపండి" అని పుట్టింటికి పంపించి నానాగోల చేసేవారు. ఇంతకూ మా అత్తగారు మంచిది......పద్ధతు లన్నీ

తెలుసు...అక్కడికి వెళ్లింతర్వాతనే నేనింత బుద్ధిమంతురా లయింది !

మా అమ్మకు ఆశ్చర్యం కలిగింది, ఆవిడ మా యింటికి వచ్చేటప్పటికి నేను పనిచేస్తూండడంచూసి. "ఈ పనంతా ఎక్కడ నేర్చుకున్నావే తల్లీ! నే నొక్కటైనా నేర్పలేదు. ఇదంతా అత్తవారసేసరికి వచ్చేస్తుంది గామోసు. నా మాట వినవైనా వినేదానివి కాదు ! ఇంత బుద్ధిమంతు రాల వౌతా వనుకోలేదు."

ఆ రాత్రి మా పక్కగదిలో వియ్యపురాండ్ర గుస గుసలు వినపడినై. పొద్దు పొయ్యేదాకా ఏమిటో రహ స్యాలు ? నేను విందామని ప్రయత్నించాను. మా అమ్మే ఎక్కువగా చెపుతున్నది ఆవిడ సంతోషంకొద్దీ.

"ఇదెంత దైందమ్మా ... వాళ్ళ నాన్నగారి మాదిరి బోళామనిషైనా వాళ్ళాయన రహస్యాలు బైట చెప్పదు... మహాగుట్టు. ఎంతో పొందికా, మర్యాదా నేర్చుకున్నదమ్మా. వదినెగారూ ! ఇదంతా మీ చలువే సుమా."

"బాగుందమ్మా...! మా ఇంటిపిల్ల అయింతర్వాత మా గుట్టు బయట పెట్టుం దేమిటి ?"

"అయినా—మీ మీదే ఎక్కువ ఆపేక్ష కొర్నాసికి. ...వాళ్ళత్తగారు మంచిదిట...చక్కగా చూసుకొంటుం దట ...చూశారా అమ్మా. ఇన్నాళ్ళు పెంచినా మేము ఉత్త వాళ్లమేగా......"

"మాకు మటుకూ వాళ్ళేకదండీ ! అమ్మాయి మధ్యా హ్నంవేళల పుస్తకాలు చదివి వినిపిస్తూ ఉంటుంది. సంగీతం

పాడుతూ ఉంటుంది. చక్కగా వాళ్ళిద్దరూ వెయ్యేకాలాల పాటు బాగుంటమే మనకు కావాల్సింది!"

మర్నాడు ఉదయం పంచపాళీలో నుంచున్నాను. మా అమ్మ ప్రయాణమైంది... నా దగ్గరకు వచ్చి చెక్కిళ్లు దువ్వి "అమ్మాయీ! వెళ్ళొస్తానమ్మా—ఉత్తరం రాస్తూఉండు" అంది.

తల ఊపుతూ కనుచూపుమేర దాటి పొయ్యే బండిని చూస్తూ నిలబడ్డాను.

అల్లరి పిల్ల అనే పేరు మాసిపోయిందిగా అని నా సంతృప్తి...అదంతా మా అమ్మ అమాయకపు పెంపకం వల్లనే అని నా దృఢాభిప్రాయం ఇప్పటికీ.



# బాధ్యత

"ఏమండీ! అబ్బ! మీ కెప్పుడూ మీ ఆఫీసు గొడవే గాని రామ, రామ ఇంట్లో యేమున్నాయో ఏమి లేవో తెలుసుకోనైనా తెలుసుకుంటేగా. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తానే ఉంటారు, ఇదేం అభ్యాసమోకాని, అన్నం తింటున్నపుడూ, చేయి కడుక్కుంటున్నప్పుడూ, స్నానం చేస్తున్నప్పుడూ ఒకటే ఆలోచన—తీరని ఆలోచన. దానితో అలస్యంకూడాను.

ఇప్పుడుమటుకు ఇప్పు డెవ్వరైనా భోజనానికి వస్తే నవ్విపోతారు. బియ్యం లేవు. చింతపండు లేదని మూన్నాళ్లి నుంచీ మొత్తుకుంటున్నాను. పప్పు నిన్నటికే వారమైంది ఖాళీఅయి. అన్నం తినేవేళకు ఏమీ చేయలేదని నన్నం టారు. ఏంపెట్టి చేస్తాను, నా మొహం ?

మీరు తెస్తేనేగా నేను చేసిపెట్టేది. లేకపోతే ఎక్క ణ్ణుంచైనా వస్తాయా'...ఆఫీసుపనంటే రాత్రింబవళ్లు చేస్తారు. బొత్తిగా ఇంటిసంగతే పట్టించుకోకపోతే ఎట్లా బ్రదకటం ? వాళ్ళు చూడండి.

ఆ రామారావుగారింట్లో నెలజీతం రాగానే నెలకు కావాల్సిన సామానంతా కొనుక్కొస్తారు శుభ్రంగా—మళ్లీ నెలదాకా దిగులూ విచారం లేకుండా. మన ఇంట్లోనో— అయిపోయినప్పుడల్లా మిల్లిమిల్లిగా కొనుక్కోడం, అదేంటనయ

మండీ? డబ్బుకు డబ్బూ వదుల్తుంది. వచ్చేవి సరిగారావు మీకుమటుకేం నయం? అట్లా పదిసార్లు తేవడం ఏంసుఖం?

ఆవకాయ వేయాలి. మంచివిగా చూసి ఎర్రని మిర పకాయను తీసుకోండి.

తర్వాత తూర్పునూన శ్రేష్ఠమైంది దొరకుతే బాగుం డును—చూడండి. వాళ్ల రంగనాథం సెలవలకి వస్తాట్ట. అతనిచేత తెప్పించి పెట్టమనండి. వాళ్ల నాన్నకు చెప్పండి మీరు. డబ్బిద్దాము. తలవ్రాపితేకాదు. ఇల్లు దాటంగానే అన్నీ మరిచిపోతారు మీరు. ఇంట్లో ఒక్క వస్తువుకూడా లేదు. మరి మీయిష్టం... అదుగో... కోటు వేసుకుంటు న్నారు, ఇవ్వాళ సెలవటగా?

అందుకనే ఆచార్లగారి భార్య వంట కాలస్యమైనా ఫర్వాలేదని తలంటి పోసుకుంటున్నదిందాక నేను నెయ్యికి బదులుకోసం వెళ్ళినపుడు. మీ కసలు సెలవనేదే వుండ దుగా ఇదేమి ఆఫీసోగాని, నా దుంప తెగిపోతున్నది. అందరి కన్నా ముం దాఫీసుకు వెళ్లడం, అన్నానికి ఏవేళకూ రాక పోవడము.

అబ్బబ్బ! నేనుమాత్రం ఉండలేకుండా ఉన్నాను. మీ ఆఫీసులో గడియారం లేదూ? వేళకు తిండిలేకండా ఉంటే ఎంతజబ్బు? తినివెళ్ళి కూచుంటే మీ ఆఫీసూ మీరు ఎంతసేపైనా ఉండవచ్చుగా!

సంత వచ్చిందంటే ఆ రోజూ మీకు ఆఫీసు గొడవే! వచ్చిన కూరగాయలన్నీ అయిపోయిం తర్వాతనైను మీరు వెళ్లడం. ప్రతివారం అంతే. కూరలుండవు, నారలుండవు...

పోనీ, మీ రింతగా రాత్రింబవళ్ళూపిరాడకుండా పనిచేస్తూంటే జీతమేమైనా వృద్ధిజేశారా? అసలు... ఆ ఆచార్యులెప్పుడూ ఇంట్లోనే ఉన్నట్టుంటా డేమండి! మరి అతని జీతం అతనికి వస్తూనే ఉందే.

అంతా తనదని నెత్తిమీద వేసుకెళ్ళే వాళ్ళుంటే సరి. వాళ్ళమీద వేసి తక్కినవాళ్ళు నిద్రపోతూ ఉంటారు. అందరి పనులూ మీరు చేయడ మేమిటి, వాళ్ల జీతాలు వాళ్ళు తీసుకుంటూంటే ?

అందుకనే మీకు ఆలోచనా, మధనాను. మీకు మటుకూ ఎందుకు వచ్చింది ? మీ పని మాత్రం చూసుకోని తలవంచుకొని వచ్చేస్తే ! మీ కస లింటిపనే ఆక్కర్లేదాయె. ఆ పనివాళ్ల చేతికిస్తారు. వాళ్లు కాజేస్తారు. మొన్న మీరు తెప్పించిన కాఫీగింజలు ఎట్లా శేరు?... వాళ్లు రూపాయకే తెప్పించా రిదేరకం... చూశారా ?

పనివాళ్ళను నమ్మి మీరు ఇంట్లో వస్తువు లన్నీ తెప్పిస్తారు. మొన్నమటుకూ మొన్న, పంచదార తెచ్చారు; అప్పుడే అయిపోవస్తున్నది. ఎంత తెస్తున్నాడో, ఎట్లా తెస్తున్నాడో కనుక్కునేవా ళ్ళుంటేగా వాళ్ళకు భయం. అట్లా కాజేసేది కాకుండా పైగా ఇనాములు !

శుభ్రంగా మీరు వెళ్ళి (కాస్త ఓపిక చేసుకుని) ఇంట్లోకి కావాల్సిన వన్నీ కొనుక్కుంటే, ఇంత నష్టం ఉండకుండా పోదూ ? ఆ పనివాళ్లు తెచ్చిపెట్టే కద్దూ. లేకపోతే లేదా ? ఇహనుంచి మీ రూరుకుంటే కాదు.

మీ ఆఫీసు మీరు ఎప్పుడూ ఉండేదే కాని—కాస్త

ఇల్లనేది, పెళ్లా మనేదీ ఉందని జ్ఞాపకం ఉంచుకుంటే బతుకుతాం."

... ... ...

అవధాని వింటూ తను ఇంటికి తెచ్చుకున్న ఆఫీసు పని చేసుకుంటున్నాడు. లలిత చెప్పిన మాటల్లో కొన్ని అతని బుర్రలోకి ఎక్కనై. కొన్ని ఎక్కలేదు. ఎక్కనవి కాసినీ సమంజసాలుగానే స్ఫురించినై. ఆ నెల జీతం రాగానే తన లలిత చెప్పినట్లు చేస్తేనే మంచిదని నమ్మాడు.

పనివాళ్లను నమ్మకుంటే కాదని తీర్మానించుకున్నాడు. ఆఫీసుపని విషయంలో మాత్రం...ఎట్లా తనకు తోచేది? ఆ పని లేకపోతే ఇతర్లలాగా ఊరికే కూచోబుద్ధి కాదు. అయినా ఇంటివిషయాల్లో ఆసక్తి పెట్టుకోవా లనుకున్నాడు. భోంచేసికాని ఆఫీసుకు వెళ్లకూడదనే నియమం బాగుంది లాగ తోచింది. మొత్తానికి తన చర్యలో మార్పు కల్పించుకోవాలని తీర్మానించుకోడం జరిగింది లలిత ఉపన్యాసంవల్ల.

ఆఫీసులో జీతం తీసుకున్నాడు. వెంటనే వచ్చి పనివాణ్ణి తీసుకొని బజారుకు వెళ్ళాడు—లలిత రాసిచ్చిన 'లిష్టు'ను జేబులో పెట్టుకుని. ఈ పనివాడు చూపెట్టిన దుకాణానికి వెళ్ళి జేబులో ఉన్న లిష్టును దుకాణాదారుడి ముందు ఉంచాడు.

చక్కగా బేరంచేసి, మంచిరకంవని అని తననుకున్న సరుకులు కట్టించుకోని పనివాడి చేతికిచ్చాడు. బిల్లు రాయించుకోని డబ్బిచ్చేశాడు దాని ప్రకారం. ఇంతలోకి స్నేహితుడెవరో అగుపించాడు. అంచేత ఒక అర్థరూపాయి ఇచ్చి

పనివాణ్ణి మార్కెట్టులో కూరగాయలు తీసుకొని ఇంటికి వెళ్తూండమన్నాడు. ఆ తర్వాత అవధాని ఇల్లు చేరుకున్నాడు, సగర్వంతో-తానే గాంగ, ఆ దినం లలిత కోరినట్లు చేశాను గదా అని మురిసిపోతూ !...

లలిత మూటలన్నీ విప్పి సరకులు సర్దుతున్నది: "ఇదేమిటండీ, ఇట్లాంటి బియ్యం! తింటానికేనా? పంచదార మూడు రూపాయలకిదేనా? ఇవ్వేం మిరపకాయలండీ? వట్టిడొల్ల! గింజా లేదు ఏమీ లేదు! కూరగాయలు మీరేనా తీసుకొస్తా? పైగా యీ లిష్టు నాకెందుకింకా! బేడా వంకాయలా ఇవ్వి? మీరు ఏ మాలోచిస్తూంటే వాళ్లిచ్చారో!... లేకపోతే ఏ స్నేహితు డగుపిస్తే మాట్లాడుతున్నారో! నాకు తెలియదూ?...ఇట్లాగైతే కాపరం నెగ్గినట్లే—ఇహనుంచి నేనే వెళ్లి తెస్తాలెండి. నాకేం సిగ్గా! డబ్బిట్లా తగలపడిపోతోంటే మరిచూస్తూ ఎట్లా ఊరుకుండేది...?"

లలితా అవధాన్లు కలిసి మళ్లీ ఆ దుకాణానికి వెళ్లి ఆ సరకులన్నీ వాపసు చేశారు...ఆ దుకాణాదారుడు డబ్బివ్వకపోయినా, మంచిరకంవి మాత్రం తూచిచ్చాడు లలిత చికాకు కనిపెట్టి.

అవధాని ఇంటికి వచ్చినతర్వాత లలితను పిల్చి, "ప్రతి నెలా జీతంరాగానే మనిద్దరం బండి వేసుకొని బజారుకెళ్లి కావాల్సినవన్నీ చక్క తెచ్చుకుందాము" అన్నాడు.

"అల్లాగే చేదాం. లేకపోతే మిమ్మల్ని నమ్ముకుంటే అవుతుందా?" అన్నది లలిత. —

# సామరస్యం

"పోతపాల దగ్గర్నుంచీ పెంచాను. పెద్దజేశాను. చదువుసంధ్యా చెప్పించాను. పెళ్లి పేరంటం చేశాను. ఓబిడ్డ తండ్రయ్యేదాకా భరిస్తూనే ఉన్నాను వాడికాపరం కూడా. ఇంతవరకూ ఒక్క చిల్లిగవ్వైనా సంపాదించలేదుగా! ఇంతా పోషిస్తే వీడు నాకు దూరమా? నామాటంటే గిట్టదూ? నామాట కెదురు తిరిగి మాట్లాడుతాడు? నన్ను చూస్తే వీడికి నవ్వుగా ఉంటుంది! ఓరిభడవా!—నువ్వెంతవాడివయ్యావురా? ఇదంతా నీ ప్రయోజకత్వమే అనుకున్నావట్రా...!

చేదోడూ వాదోడూ ఏమీ లేదు కద! ఏమన్నా పని చెపితే తగని బద్ధకం, చెరువునుంచి మంచినీళ్లు తీసుకు రమ్మంటే నామూషీ. దొడ్లో భావిలో నాలుగు కడవల నీళ్లు తోడమంటే దోషం! సుకుమారమైన దేహాలు! చెప్పేవి మోటుపనులట! ఏం? మొగవాడు కాడూ? వాములగొ నుంచి ఓగడ్డి మోపు కట్టుకొని తీసుకురా కూడదూ? ప్రతి దానికీ మొగ్గముండావాళ్లు నేను అఘోరించకపోతే. పెళ్లాం చేత ఏపని చేయించకూడదు. అరిగిపోతుందిట. పాపం! పిల్లల నెలాకంటుందో...నాకు మండుకెళ్లుతుంది ఏడు గంటలకు గాని లేవరు...ఆగది అంతే—పాచి ఇళ్లు...పాచినోళ్లాను. అప్పుడు కాఫీలు. అనవసరంగా ఖర్చు. వీళ్ల ఉద్యోగాలకి తోడు కాఫీలు కూడాను పిల్లల మొఖాలకి; బట్టలు ఉతక కూడదు. ఇస్త్రీ మడతలే కట్టుకోవాలి. మడీ లేదు—ఆచారం

లేదు. చట్టుబండలు... రామ రామ... మరీ చెడిపోతున్నది ప్రపంచం. పెద్దవాళ్లం మమ్మల్ని చూసైనా భయం, గౌరవం బొత్తిగా లేకుండా పోయినై...!

పాలు పితకాలంటే నేనో లేకపోతే మాముసలావిడో రావాలి... తాగమంటే తాగుతారు. ఏం లాభం? అనుకోని లాభం లేదు. అదేమిటంటే శ్రీమంతులింటి ఆడబొడుచు... ఒక్కత్తే కూతురు... గారాబంగా పెరిగింది... అంతకన్నా ముద్దులపెళ్లాం మా వాడికి... వెధవాయ్... ఎదురుగ్గా కూచోటం తప్ప ఏమీ చేతగాదు. ఇదివరకే నయం మాట వినేవాడు.

తిన్నకంచ మెత్తుకోని శుద్ధిపెత్తే చాలు... అసలు దాని పని అది చేసుకుంటే చాలు. బ్రతికిపోతాం. ఏకాస్త పనికైనా ఉస్సులుకొట్టడం అలవాటైంది. అట్లా చెయ్యమనిచెబుతాడేమో వీడు! అంతే ఆయి ఉంటుంది—

పెళ్లానికి సమాధానం చెప్పుకోలేని మగవాడేం మొగడంట! ఇంతవరకు ఏదీ చూడమను, మాఆవిడ ఎదురు జవాబు చెప్పుతుందేమో! చెప్పి ఎరుగేమో! చచ్చినట్లుపడి ఉంటుందిగాని... అట్లా కాకపోతే ఎట్లా కాపరాలు నెగ్గినై? ఇల్లాగేనా...

అబ్బే-మరీ రానురాను జగాభా బలహీనమై పోతున్నది. పుట్టుతూనే అజీర్తి......మందులూ—మాకులూ—నానా అవస్థలూ! పదేళ్లు కాగానే కళ్లజోడు—పధ్నాల్గేళ్లు రాగానే పళ్లూడి పోవడం... మైనరు దాటగానే తండ్రిని మెడపెట్టి గెంటడం... అయ్యయ్యో! ఎంత అన్యాయం ఎంత క్షీణించి పోతున్నది...! మొన్న మొన్నటిదాకా బస్తాలకు

బస్తాలు మోసే వాళ్లం- ఇప్పటివాళ్లు రైల్లోనుంచి తమ సామాన్లు దింపుకోలేరు! దానికో కూలి! వాడు ఆలస్యంగా వచ్చి వీడి రైలు తప్పిపోవడానికి కూడా ఒప్పుకుంటారు గాని తమ సామాన్లు మోసుకురావడం నామర్దా... ఈ చదువు లొచ్చి నాశనం చేసి నై వల్లూ, ఇళ్లూ!"

* * *

"ఇంకెన్నాళ్లు? ఈయన అసుపాజ్ఞల్లో ఉండడం? కను సైగల్లో మెలగడం. పింఛానూడు పడేస్తున్నాడనా ఈయన అధారిటీ! ఎవరికోసం పెడ్తాడు? కన్నతర్వాత పెట్టడూ? చదువు చెప్పించా, పెళ్లి చేశా, ఇంకేమేమిటో చేశానని గొప్పగా నన్ను దెప్పుతూ చెప్పుకుంటాడు. అయితే ఏం? చదువు తన పిల్లవాడికి చెప్పించు కోవడం గొప్ప విషయ మేమిటి? పెళ్ళిచేయడం మటుకూ? నాకు పెళ్ళాం రావడా నికి అయితే తనకు కోడలు రావడానికి కాదూ? తండ్రి అయిం తర్వాత ఎవ్వరికీ తప్పదు. అవన్నీ అతని బాధ్యతలు. అందుకని దెప్ప నవసరం లేదు. ఎవరైనా వింటే నవ్వి పోతారు......

నేనూ పెద్ద వాణ్ణైనాను. నాకూ ప్రపంచ మంటే ఏమిటో తెలిసింది. నాకూ పెళ్ళాం వచ్చింది. మా నాన్న కెంత బాధ్యత ఉందో నాకూ అంతే దాదాపు కుటుంబం మీద బాధ్యత కలిగింది... అవునుగదా? నన్ను చీడ పురుగును చూచినట్టు చూస్తే ఎవడు పడతాడు? తనకాలం, తన కాలం అంటాడు. అది వెళ్లిపోయి ఎన్నాళ్ళయింది? తన కాలంలో యీవిమానాలూ, యీనాగరికతా ఉందేమో

మరీ విచిత్రంగా ఉంది. ఈ కాలానుసారంగా నడుచుకోవాలి. నాకు స్వాతంత్ర్యం ఇస్తే నే నేం ఖర్చు పెట్టేస్తానా? ఏమిటి మరి కాకపోతే? ఉద్యోగం రాలేదంటే దానికి నే నేం చేస్తాను? నా ప్రయత్నాలు నేను చేస్తున్నా. "ఎప్పుడూ ఇంట్లోనే ఉంటావు... ప్రయత్నా లేమిట్రా నువ్వు చేసేది?" అని ఆయనంటాడు. ఈ పూర్వకాలం వాళ్ళ కేం తెలుసు? నే నెంత కరెస్పాండెన్సు జరుపుతున్నానో. నా Mental agony యీ uneducated old puppies కు ఏ మర్థమౌ తుంది... ఇంట్లో కూచున్నా డనుకోడం తప్ప...

అది పని చేయలేదని కోపం. ఏం, మా అమ్మకు లేని రొష్టు ఈయనకు వచ్చిందేం! ఒక్క మాటైనా ఆవిడ విసుక్కోగా చూడలా. నేను పైగా దానికి నేర్పుతున్నానట! ఎదురుగ్గా కూచుంటాడని గోల, యీన ఊరంతా మోగి పోయేటట్టు. అసలు Love అంటే ఏమిటో... స్త్రీ అంటే society లో ఎటువంటి position, occupy చేస్తుందో యీ ముసలివాళ్ళ కేం తెలుసు? మరీ వీళ్ళ సనాతనం వల్లే country ఇంత Backward గా ఉంది. లేకపోతే బాగానే ఉండి ఉండును.

స్నేహితు లెవరైనా నా కోసం వస్తే వాళ్ల నెట్లా treat చెయ్యాలో తెలియదు. వాళ్ళకు tea orrange చేస్తే యీనకు కోపం. ఆ కాస్తా వాళ్ళు వినేటట్టుగా ఇంట్లోనే వెళ్ళగక్కటం... నే నెట్లా మర్నాడు వా ళ్లింటికి వెళ్లేది? ఏ మన్నా మర్యాదా...

బీచికి షికారుకు వెళ్లటం తప్పు... ఏమిటో నా కర్థం

కాదు. దాన్ని తీసుకు వెళ్ళగూడదు. సినిమాలకు వెళ్ల గూడదు. ఇంత Miser అయితే ఎట్లా ఉన్నన్నాళ్ళూ అనుభ వించక, పొయ్యేనాడు కట్టుకెళ్తామా ?

No. No. మరీ ఈ పెద్దవాళ్ళతో వచ్చే చావే యిది. వాళ్లు చెప్పినట్లు నడుచుకుంటేనే గతి. చిన్నప్పటినుంచే యీ Slavish mentality మనకు తరిఫీతు చేయిస్తారు. ఇంగ్లీషు వాళ్లల్లో చక్కగా పెళ్లికాగానే కొడుకు విడిపోతాడు కుటుం బంలోంచి... తెలిసిన తేట...మన కల్లా ఉన్నా బాగుండును. శాస్త్రాలూ, పురాణాలూ మరోవిధంగా ఉన్నాయి మరి ! ఏం చేస్తాము విడిగా ఉంటా నంటే తప్పు. ఈ ముసలివాళ్ళను ఒప్పించడం కష్టంగా ఉంటుంది. వాళ్లకా మన culture and civilisation పనికిరాదు. అందుకనే advancement in life లేనే లేదు...ఏం చేస్తాము ?"

భిన్న మార్గాల్లో ఉన్న యీ పై ఇద్దరి సంభాషణ లకూ సామరస్యం కుదరడం హిందూ కుటుంబాల్లో ముఖ్యా వసరం.



# పరివర్తనం

"అదంతా చిన్నతనంలో... ...అమాయకంగావున్నప్పుడు... కొత్తరోజుల్లో... ప్రపంచమంటే అట్టే ఎరుగని స్థితిలో... ...నిజంగా అప్పుడట్లా జరిగిందంటే క్షమించవచ్చు. కష్టసుఖాలు తెలిసిన పెద్దవాళ్ళు క్షమింపకపోవడం వాళ్ళది తప్పు. క్షమించిఉన్నట్లయితే నేనీవిధంగా ఉండేదాన్నే కాను. చక్కగా అందరిలాగానే ఉండిపోదును. ఇంతకూ నాఖర్మ నాకా బుద్ధిపుట్టడం. వాళ్ళకా విమర్శ లేకపోవడం. నేను మా వాళ్ళ అండ జేరడం సుఖమనుకోని......

ఇప్పుడు నేను పెద్దదాన్నైనా. లోకం అంటే తెలుసుకున్నా. నన్నందరో వేలెత్తిచూపెట్టుతూంటే అర్థంగ్రహించే శక్తి వచ్చింది. నామీద నాకే అసహ్యంపుట్టింది. పోనీ, నేనేమన్నా ఇప్పుడు చేయగలుగుతానా అని ప్రశ్నించుకున్నా లాభం ఉండదేమో అని భయం. ఇప్పటికే దాదాపు తొమ్మిది వసంతాలు గడిచినై పోనీ, మావాళ్ళ నెవరినైనా ఆపనికి పూనుకోమంటే? ఎవరికి పట్టిన బిడ్డా ఎక్కెక్కి ఏడ్చిందన్నట్లుంది. ముందు మా నాన్న పడనీయడుగా!

ఆయినా, మా నాన్న కెందు కంత పట్టుదల? ఆయన పట్టుదలవల్ల నాకు నష్టమేగాని లాభం లేదని ఇప్పుడిప్పుడు తెలుసుకుంటూ వచ్చాను. అది ఆయన తెలుసుకోడేం? పెద్దవాడైనవాడు అప్పుడట్లా ప్రవర్తించాడేం? కూతుర్ని

పొట్టలో పెట్టుకున్నంత మాత్రాన కూతురి కష్టాలు పోతై అనుకున్నాడు కాబోలు పిచ్చిబ్రాహ్మడప్పుడు— కాని ఇప్పుడో? అందరూ ఆయన్ని మాత్రం ఆడి పోసుకోవడం ఎరగడూ? ఒకచెవిని బడుతూంటే రెండోచెవినుంచి వెళ్ళి పోతూవుండేట్టుగా వింటాడా మాటల్ని? ఆయనకు నుట్టుకూ ఏం సుఖం? పెత్తనంలో యీ అపవాదు. ఆయన పట్టుదల మాని, మన అవసరం అని తెలుసుకోని, తన కూతురి సుఖం కోసమని గ్రహించి ఇప్పటికైనా ఏమన్నా ప్రయత్నించ గూడదూ? అసలా విషయమే మరచిపోయాడుగా ఆయ నిప్పుడు.

మా అన్నయ్యలున్నారు. నామీదెంతో ప్రేమతో ఉండేవాళ్ళు. ఈ మధ్య అసలింటికి రావడమే మానేశారు. ఎందువల్ల? నేనేగా దాని కారణం. తండ్రీ కొడుకుల కూడా మనస్పర్థలు కలిగాయి. మొదట్లో ఎందుకో ఆపు కున్నాను. కాని రాను రాను నాకే అర్థమైంది... పోనీ— వాళ్లయినా నాకేమన్నా సహాయం చేస్తారేమో అని భ్రమ పడ్డాను. అందరికన్నా పెద్దవాడు మా నాన్నకే పంపడమనే విషయం ఏకోశానా లేనప్పుడు వాళ్లెట్లా సహాయపడతారు? అయినా అడిగించాను. లాభం లేకపోయింది... మా అన్నయ్య కొడుక్కు సంబంధాలు వచ్చినవి వెనక్కి తిరిగిపోయినాయట నా సంగతి తెలిసి...!... ఇంతకూ ఒకర్ననుకోడమెందుకు? నా రాత అట్లా ఉంది. నా వల్ల వాళ్ళకూడా అపవాదే.

తెగించి మా నాన్న నడగడానికా భయం—! పోనీ, నేనే స్వాహాసిద్ధామా అంటే అందుకూ భయమే— అక్కడ

వాళ్ళేమంటారో అని. మధ్య ఎవరయినా లేకపోతే కష్టం మరి. ఇన్నాళ్ళాయె. "వచ్చే టప్పుడు ఎవరున్నారేంటి. మళ్ళీ తీసికెళ్ళి దిగబెట్టడానికిప్పుడు?" అని అంటుంది లోకం. అవును నిజమే; కాని, అప్పుడున్న సాహసం— అవివేక సాహసం—ఇప్పుడేదీ? రోజులు గడిచినకొద్దీ పెద్ద దాన్ని కావడంలా? చేసినది దుష్కృత్యమని తెలిసికోగలిగానుగా! అందువల్లే భయం. చిన్నతనంవల్ల - ఫలిత మేవిధంగా పరిణమిస్తుందో గ్రహింపలేని రోజుల్లో ఉన్న వివేచనకూ, ఇప్పటికీ భేదం ఉండదూ?

నాకు సుఖం అనుకుంటున్నారు ఇంటా బైటా! ఏం సుఖం? జన్మ ఎత్తంగానే సరా? కడుపు కింత అన్నం, కట్టుకుంటాని కింత బట్టా ఉంటే సరా? నీతి నియమం అక్కర్లా, ఆడదానికి? భర్తదగ్గర ఉండడమే స్త్రీకి ధర్మం. దానికి లోటు కలిగితే ఇంకా స్త్రీ జన్మ ఎందుకు? — ఈ జ్ఞానం నాకు అప్పుడు లేకపోయిందిగా. ఆకలి తీర్చుకోవడమే పరమావధిగా తలచానే, ఈ జ్ఞానం మా నాన్నకైనా ఉండక్కర్లా? పోనీ—వెంటనే పంపలేదు, భయపడుతున్నదని. తర్వాత ఓ నెలకైనా తాను నన్ను దింపిరావచ్చుగా అక్కడ. నా బదులు తానైనా క్షమాపణ చెప్పుకోవచ్చుగా. అంత ధీమాగా తా నుంటే ఎట్లా? మూడువేల కట్నం పోసి, ముక్కచెక్కలు చేస్తాడా కాపరం? ఆయన చేసిందేముందిలే. నేనే చేతులారా చెడగొట్టుకున్నా, పండంటి కాపరాన్ని.

వెతుక్కుంటూ వచ్చారు పాపం, ఆ మర్నాడు. ఇప్పుడే అట్లా వస్తే ఎగిరి గంతేవేతును. అప్పుడా జ్ఞానం

లేకపోయింది. వంటఇంట్లో కుందేలు మాదిరి దాక్కొన్నా వారొస్తే. మంచివారు కాబట్టి రామలక్ష్మణుల్లాగా అన్నా దమ్ములు వచ్చారు నన్ను తీసికెళ్ళడానికి. నేను వెళ్ళడానికి భయపడ్డాను చంపుతారేమో నని. నా చిన్నతనంచేతగాని, చంపుతారా చేసుకున్న భార్యను ? అట్లాంటి వారైతే మళ్ళీ వెతుక్కుంటూ వస్తారా నా కోసం. ఛా—నా కీ జ్ఞానం దేవు డప్పు డెందు కివ్వ లేదు ?—నా ఖర్మ. పాపం గంటసేపు ఆ సావిట్లో అరుగు మీద కూర్చున్నారు నా కోసం. నేను భయంచేత బయటికివెళ్ళలా అప్పుడు. వెళ్ళినా బాగుండే దేమో! కొట్టినా, తిట్టినా పడుండేదాన్ని అక్కడే. పోనీ, మా నాన్నకైనా ఆ మాత్రం ఉండక్కర్లా ? ఇంట్లో ఎన్నాళ్లని పెట్టుకుంటాడు నన్ను ? ఆయన ఉన్నన్నాళ్ళు— తర్వాత ? ఇన్ని రోజుల్లో పాపం పండ లేదూ ? న న్నెవరు జేర నిస్తారు ? ... ?

వారికి మాత్ర మేం సుఖం ? నేనా లేచివచ్చానైనెను. ఈ విషయం ప్రపంచాని కంతా తెలిసిన సంగతైనెను ? వారి కెవ్వ రిస్తారు మరో పిల్లను చూస్తూ చూస్తూ ? వారికీ నా వల్లనే చిక్కు. అయ్యో—ఎంతమందిని అపకీర్తిపాలు చేశాను ? వారి ఆస్తంతా అప్పులపాలయి పోయిందిట. మా ఊళ్ళో విష్ణాలయంలో ఆచార్య అమ్మాయి ఆవూరినుంచి వచ్చి చెప్పింది. మా వారి కెన్నో మార్లు జబ్బు చేసిందట. మొన్న—ఈమధ్య ఈ పట్నంలో ఆసుపత్రికి తీసుకొచ్చారట ఆ విషయం మా అక్కయ్య పిల్లలు చెబితే తెలిసింది... మానాన్న అంతకఠినుడై పోయాడేం ? అల్లుడికి ప్రాణంమీదికి

వచ్చిం దనీ, ఆపరేషన్ జరగా లనీ తెలిసినప్పుడు నన్ను తీసుకొని వెళ్లనైనా లేదు. తానైనా చూసి రాలేదు. మా నాన్నకు వారున్నట్లు భావనే లేదు! మొన్న నా తమ్ముడి వివాహానికి ఆయనకు శుభలేఖయినా వేయలేదు. అంత తెగతెంచుకున్నాడు. నా మేనల్లుడు పెళ్లికి వెళ్తే అక్కడి కేమైనా మా అన్నయ్య ఆహ్వానంవల్ల వస్తారనుకుంటే అప్పుడూ నిరాశే అయింది. వారికి మళ్లీ కాపరం కుదటపడితే బాగుండు నని వున్నట్లు వింటూనే ఉన్నాను. మా వదినెలతో చెబుతూ ఉంటారట, మా ఆడబిడ్డావాళ్లు కలిసినప్పుడల్లా ... మా అన్నయ్య ఈ విషయం మా నాన్నకు రాస్తే మండిపోయి నాడు. ఆ ఉత్తరాన్ని దాచేశాడు మా నాన్న. ఎట్లానూ అతికే యోగ్యత లేదు. నా బతుకింతే— ఇట్లా వెళ్లిపోవాల్సిందే.

నా కళ్లముందర పారాడిన వాళ్ళంతా పెళ్ళిచేసుకుని ఇప్పుడు సుఖంగా కాపరం చేస్తున్నారు. ముచ్చటగా పిల్లా మేకా: వాళ్ళను చూచినప్పుడల్లా కడుపు తరుక్కుపోతూ వుంటుంది. అవును వాళ్లమాదిరి పుట్టలేదూ? నాకీ ఖర్మ మేమిటి? చిన్నప్పుడు తప్పుచేస్తే దిద్దేబాధ్యత పెద్దలది. బుద్ధిచెప్పి సరియైన మార్గాన పెట్టడం వాళ్లమీదుంది. మా నాన్న చేరదీశాడంటే గొప్పేంలేదు. ఇంకా నలుగురు నవ్వడానికి తప్ప—నా కాపరం బాగుపడుతుందా? పిల్లా మేకా కలిగి పచ్చగా ఉంటానా? అప్పుడు మా నాన్న తరుమగొట్టినట్లయితే నేను సుఖంగా ఉందునేమో! అసలు లేచి వచ్చినప్పుడు పుట్టింటికి ఆ అర్ధరాత్రి రాకుండా, ఏభావిలో

నైనా పడుంటే వారికైనా మరోపెళ్లి చేసుకోడానికి వీలు ఇచ్చినదాన్ని అయ్యేదాన్ని! అదీ చెయ్యలేను నా ఖర్మం కాలితే!...

మా అమ్మ ఏంచూసుకోనో—నన్ను చేరనిచ్చింది? మా నాన్నకప్పుడు చెప్పగూడదూ? పోనీ—ఆయన ఆవిడ మాట వినడంటే తన అల్లుడికైనా చెప్పగూడదూ. "నాల్గు రోజులపాటుండి పిల్లను తీసుకెళ్ళుదురుగాని" అని... ఆవిడ నాకన్న అయోమయం... పిల్ల ఇంటికి వచ్చిందేచాలు. వాళ్లు కొట్టారో కోస్తారో అని భయం! ఇంతకూ ఆవిడనంటే ఏం ప్రయోజనం? నాకు బుద్ధి ఉండకూడదూ మొదట్లో! అప్ర దిష్టపాలై పోయిందిగా కాపరం! నావల్ల ఎవ్వరికీ సుఖం లేదు.

పుట్టింట ఉన్నానంటే, ఎన్నాళ్లిట్లా? నాకేమన్నా బాకీ ఉన్నారా? ఇంతకూ మా అన్నయ ఊరుకుంటున్నారు కాబట్టి నేనుండగలిగాను. వాళ్ళు మంచివాళ్ళు తండ్రిమాట కేమీ అడ్డుపెట్టరు. కాని ఆయన పోయిం తర్వాత? ఇప్పుడు మాత్రం తిండి ఊరికేవస్తూందాశి — తెల్లవారుఝామునే లేవాలి, పాచిపని చెయ్యాలి, వంటఇల్లూ నడవా అలుక్కో- వాలి. చెంబులూ అంట్లూ తోమాలి. స్నానాలకు నీళ్ళు తోడాలి భావిలోనుంచి. బట్టలుతకాలి... ఎన్ని జేస్తే అయ్యేది? అందుట్లో మా అమ్మకు నేనున్నాననే ధైర్యం. పని అంటే బద్దకం ఆవిడకు. ఏంచేస్తాను మొదట్లో ఏమిపనీ చేయించక పోయినా ఇప్పుడు సకలం నామీదేపడ్డది. గొడ్లూ గోదా చూసుకోవాలి, దానికి మేతా, తవుడూ కుడితిపట్టడం— పాలుతీయడం... ఊపిరాడకుండా రాక్షసి చాకిరి. ఇంతకూ

మెప్పులేదు. ఎవరు మెచ్చను యీ చాకిరి? నా ఇల్లా నా వాకిలా? మావారు సంతోషించనా? అసలు మావారి దగ్గరున్నట్టయితే ఇంతపనే ఉండకపోను. ఇక్కడ ప్రతివాళ్ళకూ అలుసే అయిపోయినాను. ఎక్కడెక్కడివాళ్ళకూ నేనే ఉపచారాలు చేయటం! చాకిరంతాచేసి పిండం తినేసరికి మధ్యాహ్నం రెండుజాములౌతుంది. నాకేం సుఖం యీ ఎట్టి చాకిరి చేసుకోని బతకటం? సరే రెక్కలున్నన్నాళ్ళూ ఇట్లా చాకిరి చేస్తాను. తర్వాత? అయ్యోరాత! నలుగురిలో తలెత్తుకు తిరగొద్దూ? అటు చచ్చినదాన్నీ కాను— ఇటు బతికినదాన్నీ కాను"

*          *          *          *

లోపలినుంచి వస్తూన్న దుఃఖాన్ని ఆపుకుంటూ రత్నం తన విషయమంతా వెళ్ళగక్కింది. నారాయణ వింటూ ఉన్నాడు. తనతో రత్నం మాట్లాడుతున్న దనుకోలేదు. తాను విన్న సంగతులకూ, రత్నం తనకు వెలిబుచ్చిన భావాలకూ చాలా తేడా ఉంది. నారాయణకు రత్నం ఓ ప్రణయ దేవత అనుకున్నాడు. ఆ రాత్రి త నే మేమో భావాల్తో వచ్చాడక్కడికి. రత్నం మీద గట్టినమ్మకం ఉంది. నారాయణకు నిజంగా తన కిట్టి నిరాశ కలుగుతుం దనుకోలేదు. చిన్నతనంనాటి రత్నమేగా అనుకున్నాడు నారాయణ. ఆ బుద్ధి మారిపోలేదేమో అని మళ్ళీ కలపడానికి ఆ రాత్రి వచ్చాడు. కాని— పూర్తి మార్పు! ఆశ్చర్యపోయినాడు. రత్నం ప్రస్తుతస్థితికి తనే కారకు డనుకొని వాపోయాడు. నోటమాట రాలేదు... ఆ కాపరానికి చిచ్చు అంటించింది తనే

...మళ్లీ చల్లార్పడం...?

ప్రత్యుపకృతి చేయలేని బ్రతుకు వ్యర్థ మనుకున్నాడు నారాయణ. ఒకక్షణంలో తన మనసులోకూడా పరివర్తనం కలిగింది. తాను మాత్రము పశువా? పెద్దవాడైనాడు. కష్ట సుఖా లనుభవించిన వాడు. భార్య పోయినా పిల్లల్ని సాకడం తన మీదేపడింది...రత్నానికి సహాయం చేయడం తనవంతే...! కాని, రత్నం తనను నమ్ముతుందో లేదో? ఆ నాడంటే చిన్నతనం ... అమాయిక ... ఉడుకు రక్తం...ఈనాడు మరి రత్నం, సానపట్టిన రత్నంలాంటిది బుద్ధి వికసించింది. బులిబుచ్చికపు మాటలకు లోబడేదికాదు. అయినా తన కర్తవ్యం తాను మరవలేదు నారాయణ...!

తెల్లవారబోతోంది...రత్నం మళ్ళీ పనిచేసుకోడానికి లేచేవేళ నారాయణకూడ వెళ్లిపోవాలి. తన నిశ్చయం చెప్పివేయాలని మనసు తొందర పెట్టుతున్నది. మళ్ళీ తెల్లవారింది దంటే నలుగురూ చూస్తారు......

అమాంతంగా కౌగిలించుకున్నాడు ...... "చెల్లీ" అంటూ తన చేత్తో ఆవిడ శిరోజాల్ని దువ్వాడు.



# ప్రదాత

మోహానుడు అగపడడానికి ఎక్కువ ఏళ్లున్నవాడి లాగా అగుపిస్తాడు, కాని నిజంగా పదహారేళ్ళుంటాయి. నల్లగా గుండులాంటి ఆ శరీరాన్ని చూసీ, ముందుగావచ్చిన గడ్డం మూలాన్నీ, అతణ్ణి చూశినవాళ్లంతా ఏపాతికేళ్ళో దాదాపు ఉండి తీరుతాయని నిర్ధారించుకునేవాళ్లు.

మోహానుడికి అవి వాళ్ల నాన్న చనిపోయిన కొత్త రోజులు. వాళ్లమ్మ పుట్టింటి దగ్గరే ఎక్కువకాలం ఉంటూ వచ్చింది. అక్కడికి ఇరవై మైళ్లదూరంలో ఉన్న బస్తీలో మోహానుడు పిఫ్తు ఫారం చదువుతున్నాడు. ఆ బస్తీలో మోహానుడూ వాళ్లకు సొంత ఇల్లొకటి ఉంది. అందులో ఉంటూ హోటల్లో తినే ఏర్పాటు మొదటి రోజుల్లో చేశారు వాళ్ల మేనమామలు. చిన్నతనం నుంచీ మోహానుడు భయ భక్తులతో పెరిగినవాడు. ఏలోటూ లేకుండా గారాబంగా పెరిగినవాడే. బస్తీలో ఒక్కణ్ణేఉంచితే చెడిపోతాడేమో నని దుఃఖాన్ని అణచుకొని తల్లివచ్చి కొన్నిదినాల పాటుం టూండేది. దగ్గర లేనప్పుడు ఇంటికెదురుగ్గాఉన్న హైస్కూలు మాష్టరు, కృష్ణారావు కనిపెట్టూ ఉండేలాగా చేశారు... కృష్ణారావు మోహానుడి మాష్టరే కాబట్టి భయంతో మెలిగే వాడు మోహానుడు. రాత్రిళ్ళు కృష్ణారావు, మోహానుణ్ణి తనయింటికి ప్రైవేటుకు రమ్మన్నాడు......ఆజ్ఞప్రకారం

మోహానుడు ప్రతిరాత్రి కృష్ణారావింట్లోనే చదువుకోడం, పొద్దుపోతే అక్కడే పడుకోడం కూడా......

కృష్ణారావు రోజూ స్కూలు వదిలిపెట్టగానే ఇంటికి వచ్చి కాఫీతాగి క్లబ్బుకు వెళ్లేవాడు. మళ్లీ ఇంటికి అతను తిరిగి వచ్చేటప్పటికి రాత్రి తొమ్మిదిదాటేదికూడా ఒకొక్కప్పుడు. ఇంట్లోజవాను ఆవేళ్లకి లాంతరు తీసుకెళ్లితే అప్పుడాయన క్లబ్బులో ఆడుతూన్న చీట్లపేకాట ఆపేసి ఇంటికి వాడితో రావడం అలవాటయింది...కృష్ణారావుకు కమల మూడో పెళ్లికూతురు. మొదటి సంబంధం తాలూకు విధవ కూతురొకత్తే (శారద) ఉన్నది. అంటే అంతకుతప్ప మరెవ్వరూ కృష్ణారావుకు సంబంధించిన వాళ్ళు లేరు.

ప్రాయం పరిపక్వమైన స్థితిలో దురూహాలు తప్పకుండా కలుగుతవి. అది మానవ స్వభావం. దురూహాలకు దోహదమయ్యే సమయాలు లభించినప్పుడే నిగ్రహించుకోవడం గొప్పవిషయం.

మోహానుడికి స్నేహబృందం క్రమేపి హెచ్చింది. కొద్దిరోజులకే అతనికి పెద్దపెద్ద సోమరిపోతులతో స్నేహం కుదిరింది. మెల్లె మెల్లెగా నాటక కంపెనీలలో వేషాలు కొనవలైనవి అలవడుతున్నై. ఇంకేముంది? నిగమశర్మోపాఖ్యానం వల్లించాడేమో అనే వదంతి లోకంలో పుట్టింది. వల్లించడం ప్రతి కుర్రాడూ ఆ యీడులో వల్లించవచ్చు. ఆచరించాడేమో అని ఒక వదంతి. రౌడీలతో తిరగడం అనేక పెద్దమనుష్యులుచూచి ఆశ్చర్యపోయినారు. ఎవరుచెబుతారు? తండ్రిలేడాయె...తల్లి దూరానున్నది...అసలు మోహాను

డింటిపట్టునే ఉండడం లేదు...ఊళ్ళోవాళ్ళ కేంపట్టింది...?

కృష్ణారావింట్లో మటుకూ మోహానుడు యథాప్రకారంగానే ప్రవర్తిస్తున్నాడు. కృష్ణారావు బైట ఎన్నెన్నో వింటున్నా, స్వయంగా ఏమీ మోహానుడిమీద అనుమానం లేదు. అతను ఎంతో భయభక్తులతోనే ఉండడం గ్రహించాడు...అదే అతనికి కావాల్సింది.

కమలా శారదలు మోహానుడు తనయింటికి వస్తున్నప్పటినుంచీ ఎంతో ఆప్యాయంగా చూస్తూ ఉండేవాళ్ళు. శారద మోహానుడి సహాధ్యాయిని కావటాన మరింత పరిచయము. వాళ్లతో మోహానుడు పైవేటుకువచ్చి, చదరంగం, కారమ్సు, పచ్చీసు, సోపానపటం మొదలైన ఆటలన్నీ ఆడుతూండేవాడు. కృష్ణారావు వొచ్చేవేళ్లకు పుస్తకం తీసి చదువుచుండేవారు. ఆలోగా ఎన్నెన్నో కథలూ, శాస్త్రాలూ ముచ్చటగా చెప్తూతూండేవాడు మోహానుడు.

మోహానుడింట్లో మంచినీళ్ల భావి ఉంది. కమల మంచినీళ్ల కోసరమని పక్కింటికి వెళ్ళడం మానేసి మోహానుడింటికే వస్తూఉండేది తర్వాత తర్వాత మోహానుడెప్పుడైనా అగపడకపోతే ఇంటికివెళ్లి గంటలకొద్దీ మాట్లాడించి వస్తూండేది. ఇంట్లో ఏ పిండివంట చేసుకున్నా చాటుగా మోహానుడి కందజేసేది స్వయంగానో, జవానుద్వారానో, .........ఒకొక్కప్పుడు భర్తచూడకుండా అన్నంకూడా పెట్టేది మోహానుడికి. ఈ విధంగా కమలా మోహాన్ల అన్యోన్యాభిలాష క్రమంగా అభివృద్ధిపొందింది. కమల హృదయం మటుకూ వేగిపోతున్నదంటే నమ్మాలి!

మోహనుడి స్నేహితుల తన్నితరంగా భావించి ఉద్దేశించేవాళ్ళు, శారదతో ఏదికేదో సంబంధముందనీ, అందుచే కృష్ణారావుగారింటికి పోతూఉంటాడని గోల చేస్తూవచ్చారు. మోహనుడి మనస్సు చెలించిందంటే వాళ్ళమాటలవల్లనే అని అనుకోవాలి. ఎన్నడైతే ఆముఠాలో పడ్డాడో అదే అతని జీవికను వేరొక పంథాలో తిప్పిందనుకోడంలో అన్యాయ ముండదు. మోహనుడు అదివరకు లేని ఆలోచన సాగించడం మొదలెట్టాడు. శారదమీద ఒకవిధమైన దురూహ జన్మించింది.

* * *

పాపం శారద అమాయకురాలవడంచేత వేరొకనికి ఆహుతైంది. విధివ్రాత తప్పింపగలరా? కాని ఆపాపం మోహనుడి కళ్ళబడింది. నిలువునా నీరైపోయ్యాడు మోహనుడు. అమాంతంగా వెనకా ముందాలోచింపక కృష్ణారావుకు చెప్పాడు. ప్రత్యక్షప్రమాణం కృష్ణారావుకు గోచరించింది.........

ఈ విషయానికి కృష్ణారావుకు మోహనుడిమీద ఒక విధమైన కోపం జనించిన దెందుకో? క్లాసులో మాడ్చటం మొదలెట్టాడు. ప్రతి చిన్నతప్పుకు దండించేటంత ఉగ్రుడయ్యేవాడు. ఒకదినం అయిదురూపాయల ఫైనుకూడా వేశాడు కృష్ణారావు మోహనుడికి.........

ఫైనువిషయం కమలకు తెలిసింది. రాడీలంతా జేరి కృష్ణారావును బతకనివ్వరనిన్నీ, మోహనుడిమీద తనకున్న ప్రేమవల్లనూ మోహనుడికి కమల తానే అయిదురూపా

యలు ఒక ఉత్తరంలో పెట్టి అందజేయించింది జవాను ద్వారా.

* * * *

ఆతర్వాత కొన్నిదినాలకు యథాప్రకారం మోహనుడు చదువుకోడానికి వస్తూనేఉన్నాడు.........ఓరాత్రి తొమ్మిదింటిదాకా కమలా మోహన్ను ఆడుకొంటూ అప్పుడే భోంచేయమని అన్నంవడ్డించింది మోహనుడికి కమల. జవానుకు లాంతరివ్వలేదు. 'ఇస్త్రీగాని రాదుగా' అని. ఎంచేతో ఆదినం కృష్ణారావు క్లబ్బునుంచి త్వరగావచ్చి బయట జవానును దబాయిస్తున్నాడు లాంతర తెచ్చాడుకాదని. మోహనుడు తినడం సగంవర కొచ్చింది. తలుపు తట్టాడు కృష్ణారావు. కమల గుండెల్లో రాయిపడింది. తింటూన్నవాణ్ణి ఎట్లా లేవమంటుంది ? తలుపుతీస్తే, ఎట్లాగు ? పోనీ అతన్ని పంపేద్దామంటే వాకిట్లోనుంచేధారి ...... ఈ ఆలోచనలో కాస్త ఆలస్యమైంది. మోహనుడు ధైర్యంతో "తప్పేముంది ఇందులో తలుపు తీయొచ్చన్నాడు. ఈ లోగా అయిపోయింది తినడం ! కమల తలుపుతీసింది. మోహనుడు చెయికడుక్కొని అతని ముందునుంచే బయటికి వెళ్లిపోయినాడు. కృష్ణారావేమీ మాట్లాడలేదు.... .....

భోంచేసింతర్వాత కృష్ణారావు మోహనుణ్ణి పిలవమని జవానుకు చెప్పాడు. మోహనుడు, ఏదో ఉందనుకొని ధైర్యంగావచ్చాడు, లోపలజంకు ఉన్నా.

'ఏం ! మోహన్ ! ఇవ్వాళ ఎక్కడపడుకుంటావ్ !'

'మీరిక్కడ పడుకోమంటే ఇక్కడ పడుకుంటాను. మా యింటిదగ్గర పడుకోమంటే అక్కడే పడుకుంటాను.'

"ఇహ మాఇంటికి రావద్దు నువ్వు."

"ఎందుకండీ? మీరేగా పై్రవేటుకు రమ్మని చెప్పితిరి!"

'కాదులే! కారణముంది. నువ్వుమటుకూ రావద్దు'

మోహానుడు విచారంతో వచ్చి పడుకున్నాడు త నింట్లో.

* * * *

కమలకారాత్రి నిద్రపట్టలేదు. కృష్ణారావు అనుమానించాడని గ్రహించి భయపడ్డది. కంపించిపోతోంది. గత్యంతరం తోచలా......పిచ్చిదానిలాగా, కృష్ణారావు కన్ను మూయంగానే మెల్లెగా లేచి కమల ఇల్లు విడిచి వెళ్ళింది... ఎక్కడికో? ఎందుకో??

కృష్ణారావు కమల నిర్గమించిన కాశ్శేపటికే లేచాడు. కమల పక్క మీద లేదు...ఇల్లంతా వెదికాడు. తాను ఏ మనందే ఎక్కడికి వెళ్లిందా, అని ఆందోళన హెచ్చింది. జవానుని పిలిచి నెమ్మదిగా "అమ్మగారు ఎక్కడా లేదే మిరా? వెదికి చూడు" అన్నాడు. ఊరంతా వెదికారు... ఎక్కడా అగుపించలేదు. భావులన్నీ వెతికారిద్దరున్నూ. లేదక్కడకూడా. వాకిట్లో అరుగుమీద, గుడ్డ ముఖానికి అడ్డం పెట్టుకొని కూచున్నాడు. మూడో వివాహమైను! ఎంత అప్రదిష్ట? ...... మోహానుణ్ణి ఎందుకు రావద్దన్నానా, అని విచారించాడు ...... అయినా మోహానుడి వద్దకు వెళ్లి ఉంటుందా అని ఆలోచించాడు ...... మళ్లీ అట్లా సంభవించదనుకున్నాడు. మొత్తానికి కమల తన కొంప తీసేసిందనుకున్నాడు. మనసు పరిపరి విధాల వెళ్లింది. పిచ్చెక్క

పోతున్నది ...... తెల్లవారుతుందని తలుచుకునే టప్పటికి గుండె గుభేలు మంటోంది. నలుగురికీ తనే విధంగా జవాబిస్తాడు? ......అనేక ఊహాలు......

* * * *

కమల ఎదురుగ్గా ఉన్న మోహాను డింటి దగ్గరకొచ్చి నుంచోని ఉందా రాత్రి. మోహానుడు చూశాడు. అతని మనసు మరింత భీతితో నిండింది. ఆ వెనక కృష్ణారావు వస్తాడనీ, నలుగురిలో పడిపోతా మనీ చాల ఆందోళన పడ్డాడు. ఎందు కొచ్చావని ప్రశ్నించాడు. జీవితం మీద ఆశ లేక భావిదగ్గరికి వచ్చా నన్నది కమల. మోహానుడు మొండి ధైర్యంతో ఆవిడమీద జాలివేసి 'నీ కేమీ ఫరవా లేదు; నే నున్నా' నని చేరదీశాడు. మోహానుడు మనస్సులో, తెల్లవారే టప్పటి కావిడతో అవసరమైతే జీవికను చాలించే టంత నిశ్చయానికి వచ్చాడు...కమల అతనికి సమీపంలోనే భయంతో ఒరిగి ఉంది ..

జవాను వెదికి వెదికి మెల్లగా మోహానుడి దగ్గర కొచ్చి పిల్చాడు. కమల గుండె ఝల్లు మన్నది. కాని ఆ చీకటింట్లో లోపలఉన్న కమల వాడికి అగుపించ లేదు. మోహానుడు మాత్రము మాట్లాడాడు.

"ఏంరా? ఎందు కొచ్చావు?"

"కమలమ్మగారు ఎటో వెళ్ళిపోయిందండీ"

"ఏడవమను అయ్యగారిని. నిక్షేపంలాంటి భార్యను అవమానించాడు. దక్కించుకునే యోగ్యత లేదు!"

ఈ మాటల్తో జవాను చకాకాపోయాడు...

*   *   *   *

కమలా మోహన్ల మనసులో కేలాగ ఆలోచింస్తున్నై. ఇద్దరి హృదయ తంత్రు లొకే స్వరంలో మేళవించినై. భయంలో ఒకరి కొక రాధారమై ఒరిగిపొయ్యారు. ఉదయం వచ్చినా, కృష్ణారావు కనుగొన్నా జీవితాంతం వరకూ కమలకు నీడ ఇవ్వడానికి సంసిద్ధుడైనాడు మోహనుడు. తాను వివాహమాడననీ, కమలకు ఏవిధమైన భయమూ అవసరం లేదనీ, తనకూ కమలకూ మధ్య లేనిపోని కల్పనలు కల్పిస్తే లోకం, ఆ కల్పనను యదార్థముగా చేసి భరించగల్గుతాననీ, లేక పవిత్రంగా భావిస్తే ఆ విధంగానే ఉండటానికి అభ్యంతర ముండదనీ ఆ రాత్రల్లా మోహనుడు ఏ వేవో చెపుతూనే ఉన్నాడు...

తెల్లవారుఝాము వేళయింది. మోహనుడు చాల భయపడ్డాడు. ఒకొక్కప్పుడు ధైర్యం భయానికి తావిచ్చేది ...కమలను సమీపంలో ఉన్న దేవాలయంలోకి తీసుకెళ్ళి అక్క డుండమని చెప్పాడు. తాను తిరిగి వచ్చి కృష్ణారావు ఇంటిముందు నాల్గుసార్లు అటూఇటూ ఆయన చూచి పిలుస్తాడేమో అని తిరుగుతున్నాడు.

లోలోన కుళ్లుతున్న కృష్ణారావు — "ఎవరా పొయ్యేది" అన్నాడు గద్గదస్వరంతో...

"నేను మోహనుణ్ణి"...దగ్గరికి వెళ్ళాడు.

బావురుమని ఏడ్చాడొక్కమాటు. "నీ వో సహాయం చేసిపెట్టాలి మోహనా. కమల గ్రామంనుంచీ అగుపించడం

లేదు. ఏమైందో తెలియదు. నిన్ను రావద్దన్నానని కామోసు ..." అని చేయిపట్టుకున్నాడు.

మోహన్ కరిగి పోయినాడు. మళ్లీ బింకంగా "నేనూ చూస్తానండి......" అన్నాడు ముక్తసరిగా.

*　　*　　*　　*

కమల దగ్గరికి వచ్చి, "తెగ ఏడుస్తున్నాడు. "నీకేమీ భయం లేదు ... ని న్నేమీ అనదు. అంటే నాదీ భారం వెళ్దాం రా" అని చెప్పి దేవాలయంనుంచి ఏదింటికి వెంటపెట్టుకుని తీసుకొచ్చి కృష్ణారావుకు వప్పగించాడు.

కృష్ణారావు ఆమెనూ మోహనుణ్ణీ చూసి అమాంతంగా ఏడ్చాడు...మళ్లీ నిబ్బరించుకుని, కమలతో "ఇంట్లోకి వెళ్ళు" అన్నాడు. మోహనుడు వెళ్ళబోతుంటే "మోహన్! మాఇంట్లోనే ఉండి చదువుకో మీ అమ్మవాళ్ళువచ్చే దాకా......" అన్నాడు.

మోహనుడు "వద్దులెండి. అనుమానం లేనన్నాళ్ళూ ఉన్నాను గదా! క్షమించండి" అని వెళ్ళిపోయాడు.

తెల్లవారగానే కృష్ణారావు ముంగిట్లో కళకళలాడుతూ పచ్చతోరణాలూ, మహోత్సవదినం మాదిరి నూత్న తేజస్సూ వి స్తరిల్లాయి!

మళ్లీ మోహనుడు వాళ్ళింటికి వెళ్ళడంటే నమ్మాలి! మోహనుణ్ణి ప్రాణప్రదాతగా కమల పూజిస్తుంది. కృష్ణారావు గౌరవప్రదాతగా భావించి గౌరవిస్తాడు, ఇప్పటికీ.

# ఉపదేశం

కలలు నాకు సామాన్యంగా రావు. వచ్చినా మేల్కొనేటప్పటికి ఎంత ప్రయత్నించినా జ్ఞప్తికి వచ్చేవి కావు. ఆరోజు వచ్చినకలను అదేమి చిత్రమోగాని మరచి పోలేకపోయ్యాను. కలలో కలిగిన ఆనందాన్ని గాని దుఃఖాన్ని గాని ఇతరులకు చెప్పితేనే మనస్సుకు తృప్తి. కనుక నేను కూడా చెబుతున్నాను. మధ్యాహ్నం మూడుగంటలకు మా సంఘసభలో 'స్త్రీలు వారి నాగరకత' అనే అంశాన్ని గూర్చి నే నుపన్యసిస్తూ వుండగా ఒక ముసలి బ్రాహ్మణుడు సభలో నుంచి నన్ను పిలిచాడు. పిలవంగానే సభవారి ఆజ్ఞ తీసుకొని వెళ్లాను. ఆ బ్రాహ్మణుడు నన్నొక నిర్జన ప్రదేశానికి తీసికెళ్లి అబ్బాయీ! నీ ఉపన్యాసం విన్నాను. స్త్రీ ప్రపంచం నీకు అపరిచితంలాగ వుంది. నామాట ప్రకారం చెయ్యి. నీకు తెలుస్తుంది! అన్నాడు. నే నాశ్చర్యంతో 'సరే' నన్నాను.

'తూర్పు తిరిగిచూడు ఏం కనపడిందో చెప్పు' అన్నాడు. నాదృష్టిని ఆదిక్కుకే ప్రసరించాను.

ప్రశాంత వినీలాకాశంలో మినుకు మినుకుమనే నక్షత్ర సమితిమధ్య రేరాజు. కొండచరియల్లోనుంచి, గులకరాళ్ల మీదుగా గలగలా ప్రవహిస్తున్న సెలయేళ్లు, కొండసందుల్లో జనించి, క్రింద సెలయేళ్లల్లోకి వొంగి, వాటితో కలసిపోతూన్న లతల్లో కలవకండా అక్కడే నిలుచున్న మృదు లతకూనలు, సెలయేళ్లతో కలసి పయనమైపోతూ కొన్ని గులకరాళ్లనూ,

ముళ్లమండలకూ చిక్కుకుని చివికి నల్లబడిన తీవలు, సెల యేళ్లతో బడకండానే ప్రవాహాలదరిదాపుకు వచ్చి కూడా అట్టే ఆగిపోయి గట్లమీద నిలబడిన లతలు.

'అబ్బాయీ! నీవు చూస్తున్న ప్రవాహాలన్నీ ప్రపంచంలోని పురుషులు. లతలన్నీ స్త్రీలు. ఆ మృదులతకూనలు పసిపిల్లలు. సంసారసుఖ మనుభవిస్తూ దుష్టుల దుండగములకు గురియైనవే ఆ నల్లబడిన తీవలు. సంసారసౌఖ్యమనుభవిద్దామని సంతోషంతో గట్లదాకావచ్చి గులకరాళ్లను చూచి, ముళ్లమండల్ని చూచీ కుమిలిపోతూన్నవారిని చూచి, భయపడి సంసారంలోకి దిగనివే. ఆగట్లమీద ఆగిపోయిన లతలు!' అన్నాడు ప్రక్కనేవున్న ఆ బ్రాహ్మడు. నేనట్లాగే వింటూ నిలబడ్డాను. 'పైన సంచరిస్తూన్న రేరాజును చూశావూ? అతడు నీకూ నాకూ నిర్మలంగా సంచరిస్తూ కనబడినప్పటికీ వివిధతావుల్లోవున్న ఆ లతలకు రకరకాల భావాలు కలుగ జేస్తాడు. నువ్వు గమనించు ఇంకా,' అన్నాడు. అనంగానే నే నావేపుచూశాను. ప్రవాహాల్లో కలసిపోతూన్న లతల్ని, రేరాజును చూశాను. ఆ లతలభావాల్ని గ్రహించే శక్తి నా కలిగింది! అవి స్తోత్రం చేస్తున్నాయి. రాళ్లల్లో మండల్లో చిక్కున్న తీగెలు రేరాజును దూషిస్తున్నాయి. గట్లమీద నిలచిపోయిన లతలు ఆ రేరాజు యేలుబడిలో ఉండలే మని తహతహ లాడుతున్నాయి. మృదు లతకూనలు ఆ వెన్నెల్లో సుఖంగా ఉండి ఆడుకొంటున్నాయి. చూస్తూవుండగానే చల్లని గాలి మామీదుగా పోయి ఆ తీవల్ని తాకింది. 'ఈ మారుతం లతల్లో ఎన్ని మార్పులు కలుగజేస్తుందోచూడు'

అన్నాడు బ్రాహ్మడు 'ఏమిటీ గాలి ?' అన్నాను. "ప్రపంచంలో 'నాగరికత' అని అంటారు దీన్ని !" అన్నాడు. ఈ గాలి వెళ్లి ఒక ప్రవాహంలో వున్న తీగెను వేరే ప్రవాహంలోకి నెట్టింది. గట్లమీదవున్న తీగెల్లో కల్లోలం కల్గించింది. ఆ గాలి సహాయాన్ని స్వీకరించి కొన్ని ప్రవాహాల్లోకి దూకినై. మరికొన్ని వెనుదీసినై. జన్మస్థానంలో నిలచిపోయిన లతకూనలు చల్లగాలుల్లో ఆడుకుంటూ ఎట్టి సంచలనం లేకండా ఉన్నాయి. 'చూశావుగా నవనాగరికత ! విడాకు లివ్వడం మొదలైన ఫ్యాషన్లు ?' అన్నా డా బ్రాహ్మడు. 'ఆ లతల్లోకి జాగ్రత్తగా చూడు' అని రెట్టించాడు. చూశాను.

ఆ లతల్లో అక్కడక్కడ కొన్ని పూవు లున్నాయి. అవి అనేక రంగుల్లో విరాజిల్లుతూ ఉన్నాయి. ఎంతో అందంగా వుండి ఆనందాన్ని చూరగొంటున్నాయి ఆకుపచ్చ తీవల్లోనుంచి దోబూచులాడుతూ ఉన్నా యా ప్రసూనాలు. వాటిని నాకు తీసుకుందా మనిపించింది. నాఊహను గ్రహించే కాబోలు అతను 'తెంపబోకు. ఆ పూలకోసమే ఆ లత లంత అవస్థ పడుతున్నాయి. లతలకు వాటిమీద ఎంతో ప్రేమ. ప్రవాహాల్తో కలసి పయనమౌతూన్న లతలకు ఫలితం ఆ ప్రసూనాలు. అవే సంతానం ! ఈర్ష్య ప్రపంచాన్ని చూట్టానికి వెరచి లతల్లోనే అణగియున్నై. తమ ఆనందాన్ని చుట్టూ ఉన్న లతలకూడా పంచుదామన్న బయటికి వచ్చిన కుసుమాలు భగ్నమనోరథలై నిలిచి నివ్వెరపోయి చూస్తున్నై. అబ్బాయీ ! ఒకరి ఆనందాన్ని చూచి సహించలేదు ప్రపంచం !' అన్నాడు. ఆ లతల్లో గుసగుసల్ని విన్నా నాకా

విధంగానే తట్టింది. వాటి భాష నా కలవడింది గనుక అవి అనుకుండే విషయాలు తెలుసుకున్నాను.

'కొండ సందుల్లో నే నిలిచిన లతలు ప్రవాహాల్లో కలవడానికి తగినపొడవు పొందినా అలా కలవకుండా ఉన్నాయనీ, కలవడానికని పోయి గట్లమీదే నిలబడిపోయిన వెందుకోయని, నల్లబడి రాళ్ళల్లో చిక్కున్న వాటిని గూర్చి ప్రవాహాల దేమీ తప్పులేదు; ఆ తీవల్దే తప్పు; తమ తను ప్రవాహాల్ని వదలి వేరే ప్రవాహాల్లో కలసిపోదామని ప్రక్కకు తప్పుకొని రెంటికీ గాకుండా చెడిపోయినవనీ, ప్రవాహాల్లో కలసి పయనమౌతోన్న లతల్లో కొన్నింటిని ప్రవాహమధ్య లోనుంచి పోకుండా పక్కగుండా పోతున్నె అనీ, ఐక్యతాట్టే ఉన్నట్లు అగుపించదనీ, ప్రవాహమధ్యంగా పెనగిపోతున్నా వాటికి ఫలందక్క లేదనీ లతల్లో లతలు గుసగుసలు.'

'విన్నావా లతల రహస్యాల్ని ' ఒకరి విషయం మన కెందుకని ఊరుకోదు ప్రపంచం! ఒకరి కొరకరికి సరిపడదు. ఈర్ష్య! ఇంతా జేస్తే సుఖంగావున్న లత లెన్ని ఉన్నాయో చూశావా? లోపమనేది ప్రతిదానికీ ఉంది. వున్నా తమ లోపాల్ని చూసుకోకండా ఇతరుల లోపాల్ని చూచి వెక్కిరిస్తాయి. వాటి మాటలు విన్నావు కాని ఇక వాటి చర్యలు పరికించు' అన్నాడు వాటి మాటల్ని వినేటప్పటికి నా కేదో విధమైన అసహ్యాం పుట్టింది. నా చిత్తవృత్తిని గ్రహించి అన్నాడా బ్రాహ్మడు 'చూశావుగా అబ్బాయి! ప్రపంచ మంతా ఇంతే! ఈ ప్రపంచంలో తలవొగ్గి తనదారిని పోయే వాడివి కాదు రోజులు. అన్యాయము, కృత్రిమము, అమర్యాద

అసత్యము తన సొత్తుగా కలవారే మహామహులు. కాని పర లోకంలో వారికి స్థానమే శూన్యం! ఇట్టి ప్రపంచంలోనుంచి తప్పించుకొనే మార్గం వేరే లేదు.'

ఈ మాటలు వినేటప్పటికి నాకు కళ్ళల్లో గిర్రున నీళ్లు తిరిగినై. దీనంగా బ్రాహ్మణ్ణి చూస్తూ పరమావధి ఏమన్నట్లు మోకాళ్ళమీద నిలుచున్నాను. పాపమతను నన్ను లేవనెత్తి 'ఆ ప్రవాహా లెటుపోతున్నవో చూడు' అన్నాడు. అవన్నీ పోయి ఒక పెద్ద సముద్రంలో కలిసిపోయినై. ఆ లత లన్నీ వాటితో సహా ఆ నీళ్లలో కలిసి ఎటుపోయినవో! నిర్వర్ణించి చూశాను. కొన్ని ద్వీపాలు అగుపడ్డాయి. వాటిల్లో ఎవరో - దేవతల్లాగ వున్నారు. పూలపాన్పులపైన ఆడుకొంటున్నారు. ప్రక్కనే ఉన్న బ్రాహ్మడు 'అబ్బాయీ, ఆ ద్వీపాలే స్వర్గలోకం! దాంట్లో ఆడుకుంటూన్నవాళ్లే ప్రపంచంలో సుఖంగా సంసారయాత్ర సాగించి సత్ప్రవర్తనులై సంచరించిన మహానుభావులు!' 'అయితే ప్రపంచంలో అన్యాయ అసత్య ప్రవర్తను లేమైనారు? వారి స్థానమెక్కడ?' అన్నాను. జవాబు రాలేదు. ప్రక్కకు తిరిగి చూశాను. బ్రాహ్మడు లేడు! ఆ ద్వీపాలవేపు చూశాను. అవీ లేవు! ఇంతలో ఉలిక్కిపడి లేచాను. చూచుకుంటే నా పక్కమీద నే నున్నాను.



# పవిత్రజీవులు

సామాన్యంగా, యువతీయువకుల జీవితాల్లో పరివర్తనం కలిగించేది సముద్రతీరం! అంటే నిరాకరింపబడిన ప్రేమవలన తనుత్యాగానికి పూనుకునే యువతీయువకులకీ సముద్రమే శాంతిప్రదేశం! ప్రేమాంకురానికికూడా యీ సముద్రుడే కొందరిలో కారకుడవుతూంటాడు. కఠినహృదయుల మనస్సు కరిగించేదికూడా సముద్రంమీదనుంచి వచ్చే చల్లగాలుల తాకిడే. ప్రేమజీవులలో విరహావేదనను బలపరచేవి సముద్రదృశ్యాలే! ప్రేమచే పీడింపబడే హృదయాలను కలవరపెట్టి కొన్నితడవలు కవులుగామార్చి కావ్యాల్ని అల్లించేదికూడా సముద్రపుగాలులే. విషాదహృదయాలకు శాంతిచేకూర్చే దీ దృశ్యాలే. ఇలాంటి పరివర్తనాలన్నిటికి కారకుడు పుణ్యాత్ముడైనా—పాపాత్ముడైనా, ఆ సముద్రుడే! సముద్రుడే మనకు అర్థమయ్యే భాషలో మాట్లాడగల్గితే ఎన్నెన్నో కథల్ని కావ్యాల్ని చెప్పగలడు!

ఈ విధంగా పరివర్తనం పొందిన ఆశాజీవుల దారుణ ఘట్టం వింటేనే గాని సముద్రుడెలాంటివాడో, కరుణామయుడో కఠినహృదయుడో తెలియదు.

* * * *

సరోజిని వేశ్యాకులంలో జన్మించింది. తా నాడుకునే రోజుల్లో తమకులంపైన అనేక మాటల్ని వింటూవచ్చింది.

అందులో నిజం గ్రహించింది. దానిలో ఉన్న నైచ్యం వేరె క్కడా ఉండదని అనుకుంది. సంగీతనృత్యాలు కళాభిమానంతో, విద్యాసంస్కారంకోసం నేర్చుకుంది కాని సరోజి నెప్పుడూ తన కులవృత్తికి తోడ్పడుతాయనే అభిప్రాయం పెట్టుకోలేదు; ఆ యీడురాగానే ప్రపంచాన్ని విడిచిపెట్టా లనుకుంది—ఎంగిలికూడుకన్న! వేశ్యవాడల్లో దొరికే పుస్త కాల్ని కన్నెత్తి చూడనైనా చూశేదికాదు సరోజిని! సంగీత నృత్యాల్లో నలుగురికీ మెప్పించే స్థితిలోకి వచ్చేసరికి సరో జిని యీడేరింది! పాటకచ్చేరీలో సరోజినిని ప్రవేశపెట్టా లని వాళ్ళవాళ్ళ అభిప్రాయం. విద్యాప్రకటనకు వెనుదీ యలా సరోజిని, తనవాళ్ల అభిప్రాయం కనిపెట్టినా. లోకంలో 'వేశ్య'అని పిలిపించుకునే స్త్రీకంటే నీచం వేరేలేదని సరో జిని అభిప్రాయం. తనజీవితం పవిత్రంగా వెళ్లిపోవడానికి అవ కాశం లేనప్పుడు ప్రపంచం వదలాలనుకుంది.

* * * *

పాటకచ్చేరి పెట్టారు నాటకశాలలో. అట్టహాసం చాలా చేశారు. ముందుముందు సరోజినివల్ల ఎంతవచ్చినా రాకపోయినా, వాళ్ళవాళ్లకు ఈ పాటకచ్చేరీకి అమ్మిన టికెట్ల ఖరీదే సంతోషాన్ని చేకూర్చింది. హాలంతా కిట కిటలాడుతున్నది. ఆలస్యమౌతున్నందుకు యీలలేకాదు— అరుపులేకాదు—పోట్లాటలేకాదు—నాటకశాలమీద — రాళ్ళు రువ్వడమేకాదు—ఆ కాశ్శేపూ నానాగోలచేశారు ప్రేక్షకు లంతా! తెరలోపలనుంచి సరోజిని దీన్నంతా వింటూనే వుంది. ప్రజల మనోవికాసాన్ని బాగా గుర్తించింది! స్త్రీ

జాతిని సృష్టించిన దేవుణ్ణి తిట్టింది. పురుషులింత అవినీతిపరు లైనందుకు చాల చింతించింది. తా నొక్కతె ఏంచేయ గలుగుతుంది ? ఉన్న ఉత్సాహం ఉరికింది—కీలుబొమ్మ మాదిరి నిలుచుంది సరోజిని. వళ్ళు వణకిపోతున్నది. చెమ టలు దిగ్గారుతున్నై. అలంకరణమంతా అంతరించింది. మళ్లీ దిద్దుతానని వచ్చాడు అలంకరణకు. వద్దన్నది, సరోజిని. పూలదండలు మెళ్లో వేయబోయినారు. తీసివేసింది. కళ్ళవెంబడి నీళ్లను తుడుచుకుంది చేత్తోనే. చెక్కిళ్ళ మీదికి జారిన నల్లని గీత లల్లాగే ఉన్నాయి. తెర ఎత్తారు... ఏముంది ? వనంమాదిరి సమకూర్చియుంచిన తోట్లూ—వెనక జలపాతాన్ని చిత్రించిన తెర ! సరోజినిని లోపలినుండి నెట్టుతున్నారు వెళ్ళమని—జరగదు ! భయం కాదు ఆవిడకు. అసహ్యం ! ప్రేక్షకు లాగేటట్లులేరు. అప్ప టికే అరగంటైంది ఆలస్యం. లోపలినుంచి ఎవరో ఒకతె నెట్టు నెట్టారా సరోజినిని. సరోజిని అమాంతంగా రెండుకుంపట్ల మధ్య వచ్చిపడింది !—ప్రేక్షకులంతా నివ్వెరపోయి చూస్తు న్నారు. ఎంతసేపటికీ లేవలేదు సరోజిని. లోపలినుంచి రహ స్యాలతో లేపాలని ప్రయత్నించారు. సాధ్యంకాలేదు. కారణం ? సరోజిని మూర్ఛపోయింది ! తెరవేశారు. ప్రేక్ష కుల్ని ఆపి పెట్టేందుకు హాస్యగాడి నొకణ్ణి ప్రవేశపెట్టారు...!

మళ్లీ తెరఎత్తేటప్పటికి సరోజిని నృత్యం చేయడం మొదలెట్టింది. ఏంతసేపు చేసిందో ఎవ్వరూ చూడలేదు. వచ్చిందంగు కోసమైతేగా ? సరోజిని చివరికి నోరెత్తింది. ఏమి మాట్లాడిందో ఆవిడకే తెలియదు. మళ్లీ యీాళలూ,

కేకలూ, ప్రేక్షకుల్లో చెలరేగినై. సరోజిని స్తంభంలాగ నిలుచుంది. ఉతడవ భయం ఆవిడను దగ్గరించ లేదు. అసహ్యం కూడా అంతరించింది. చంచలనేత్రా లొక్క-మారల్లాగే నిలిచి పోయినై. ఎదురుగా సోఫాలో కూచున్న ఓవ్యక్తికళ్లు సరోజినికి రహస్యంగా అన్నివిధాలా ఊఠత నిస్తున్నట్లు అగుపించినై. ఈప్రపంచంలో తనకు హాయిని చేకూర్చే నేత్రాలు రెండున్నవా అని ఆశ్చర్యపొందింది సరోజిని. కాశ్యేపు అనుమానించింది. కళ్లు వాటంతటవి, మూతలుపడినై. కాని తన లోపల లోశక్తి ఆ రెండుకళ్ళనే ఆధారంగా చేసుకోమని ప్రోత్సహిస్తున్నది. ఆ రెంటితోనే తన భావిజీవితం, భావి ఆనందం ఉన్నదని అంతరాత్మ బోధించింది ఆ అచేతనమైన విగ్రహానికి. తీక్షణంగా కాశ్యేపు ఆకళ్లలోకి చూసింది. ఆ తీక్షణానికి కరగిపోయినై ఆవలిరెండు నేత్రాలూ. దీనంగా వెంటనే చూసిందిమ. ఉతడవ కాఠిణ్యంగో కరగిపోయినై. సరోజినేదో మాట్లాడాలని ప్రయత్నించింది. పెదిమెలు కదలుతాయిగాని వెలుపలికి శబ్దమురాదు. స్వశక్తి చాలదనుకుని చింతించింది. చివరికి నిశ్చేష్టితురాలయింది! ఇంతలో తెర పడింది.

* * * *

అదే మాళిసరోజినులలో ప్రేమబీజం నాటుకున్న సమయం. మాళి లోపలికివెళ్లి సరోజినీ వాళ్ళ అనుమతిమీద ఆవిడెను సమీపించాడు. సరోజిని ఓ సోఫాలో కూలబడి ఉన్నది. లోపల కొందరు 'చాల బాగుంది నాట్యం' అంటూ అభినందనా లిచ్చారు. ఆమాటల్ని పెడచెవిని బెట్టింది సరో

జిని. "మూర్ఛపోయినా ఆనాట్య పారవశ్యంలో అలా జరిగిందనీ అదోవిధమైన భంగిమననీ అనుకుంటున్నారు, భేష్! సరోజినీ." అని తనవాళ్ళంటూన్న మాటల్ని వినలేదు. ఏదో ఆలోచిస్తూన్నది. నిమిష నిమిషానికీ ఆవిడముఖంలో మార్పుగుపిస్తున్నది.— కాస్సేపు వికాసమూ, మరికాస్సేపటికి విషాదమూను. ఎవర్నీ లక్ష్యపెట్టకుండా ఉన్న సరోజిని మాళివచ్చేటప్పటికి లేచి నిలుచున్నది. మాట్లాడాలనుకొంటుంది కాని మాటలురావు. హృదయం కరగించే చూపుల్ని ఒక్కమాటు మాళికేసి ప్రసరించింది. మాళి హృదయం సరోజినికి తావిచ్చింది. అందుకనే మళ్ళీ మాళి చూపులు సరోజినికి ధైర్యం యిచ్చినై. సరోజిని కేదో అస్థలం చాల అసహ్యంగా తోచింది. ప్రతివ్యక్తీ వచ్చి ఆవిడకేసి చూడడమే! ప్రతి వ్యక్తీ ఆవిడతో మాట్లాడాలనే వెధవ అభినందనాల పేరు చెప్పి. "పాపప్రపంచం" అనే ముక్కలు జారినై నోటినుంచి. మాళి అందుకున్నాడు "కాదు—పాప ప్రపంచంకాదు.— అంతా చీకటైనా ఒక్క మిణుగురు పురుగైనా వెలుగిస్తూనే ఉంటుంది" ఈముక్కలో ఉన్న అర్థం బాగా గోచరించింది సరోజినికి. తన సందేహమంతా ఒక్కమాటు తీరింది. పరస్పరం మాటలతో యిద్దరి మనసులూ ఏకమైనై. సరోజిని వేశ్యావృత్తికి దూరం కాబట్టి మాళినే జీవితాంతం వరకూ స్వీకరించాలని కోరింది. మాళి, చేతుల్లో చెయ్యేసి, వాగ్దానం చేశాడు. సరోజిని తన ఆశయం చిగిర్చినందుకు సంతోషించింది. ఇద్దరూ ఆనాడే అవూరువిడిచి దూరానఉన్న పట్నానికి వచ్చారు. సరోజినికోసం వాళ్లు వెదికారు. కనబడకపోతే

మంది. తన ముందుగతి? మాళి ప్రేమభిక్ష పెట్టడా అనుకుంది. ఏమో— పురుషుల్ని నమ్మరాదు. ఉత్తరం దాచేద్దా మనుకుంది. కాని మనస్కరించ లేదు. మాళికి చూపించి అభిప్రాయం కనుక్కోవా లనుకున్నది!

సరోజినిమాత్రం దిగులు వెలిబుచ్చకుండా మాళి సాయంత్రం రాగానే ఫలహారం రోజూమాదిరి చేసిపెట్టింది. మాళికూడా నాలుగు నారింజకాయలూ, పూలూ తెచ్చాడు వస్తూనే! మాళి మంచంమీద కూచుని పకోడీలు తింటున్నాడు. సరోజిని లోపలినుంచి వస్తూన్న హాస్యాన్ని అణచుకొని, "మాళీ...!" అంది. మాళి తలెత్తాడు. 'మంచినీళ్ళు కావాల్నా?' అంది. 'అవును—కారంగావున్నై పకోడీలు' అన్నాడుమాళి. నీళ్ళిచ్చి నిలుచున్నది సరోజిని. నీళ్ళు తాగుతూ టేబిలుకేసి చూశాడు మాళి ఉత్తరం ఉన్నది...!

తీసికొని చదివా ! తలవంచుకునీ టేబిలుపట్టుకొని నిలుచున్నాడు. సరోజిని దగ్గరికివెళ్ళింది. అందులో తప్పేమీ లేదన్నది. పురుషు లన్నిటికీ సమర్థులన్నది. మాళి అంగంలో చిత్రపటాన్నిచూస్తూ ఉన్నంతలో సరోజిని మాళి తినగా మిగిలిన పకోడీలను తాను తిని మాళి తెచ్చిన పండు నొకటి వలిచిపెట్టిందా పళ్ళెంలో. మాళిముందర పళ్ళెంపెట్టి 'ఫలహారం పూర్తికానీ...!' అన్నది. మాళి పళ్ళెంలో చెయ్యి పెట్టాడు. 'ఇందాక మిగిలిన పకోడీలేవీ?' అన్నాడు. 'అవి కారంగా వున్నాయిగా......? కొత్తపండు వొలిచాను... నాచేతుల్తో......తిన' మన్నది సరోజిని. వద్దన్నాడు మాళి. పకోడీలతోనే కడుపు నిండిందన్నాడు. ఆకలయినప్పుడే ఆర

గించండన్నది సరోజిని తలవాంచుకొని. కొంతసేపు ఇద్దరూ మౌనంవహించారు. ఇద్దరికళ్ల వెంబడీ ఒక్కమాటు నీటి చుక్కలు జారి కిందపడివున్న పటంమీద పడినై. సరోజిని మాళి కళ్లను చీరచెంగుతో అద్దింది. 'కులవృత్తివొదలి సుఖంగా ఒక్కనితో ఉండాలని వేశ్యాకన్య ప్రయత్నిస్తూ వుంటే పురుషులు వేశ్యావృత్తి నవలంబిస్తారా?' అని మాళి పెదిమెలు చప్పుడుచేసినై! సరోజిని సంతోషించింది ఆ మాటలువిని. చాలనుకున్నది, భోజనాలు లేకనే పడుకున్నారిద్దరూ. నిద్రలో ఒకమాటుమాళిలేచి వొలిచిపెట్టిఉన్న ఫలరసాన్ని సరోజినికిచ్చాడు తాగమని. సరోజిని అన్నమాటలు కునుకుపడుతున్నమాళికి వినబడినై: 'రసం చాల తియ్యగా ఉన్నది. మీరుకూడా రుచిచూడరూ? జాగ్రత్తగా అట్టేపెట్టాను.' కాని, మాళికి నిద్రపట్టింది!

* * * *

ఒకరాత్రివేళ సరోజినికి మెలుకువచ్చింది. లేచి కిటికీ దగ్గర నుంచుంది. తానువచ్చినపని నిర్వర్తింపబడిం దనుకున్నది. మరుక్షణం తనకు తావులేదనుకున్నది. ఆయింట్లోగాని, మాళిహృదయంలోగాని. ఎంతప్రేమించినా పురుషులుమాయగాళ్లనుకున్నది. మాళి తనభర్త కాపుగదా అనుకుంది. ఎంత ప్రేమించుకొన్నా తాను వేశ్యనే అనుకున్నది. దాపరికపు బ్రతుకు వేశ్యవాడల్లో ఉగ్గుతో అలవడింది, ఎంత తప్పించుకున్నా వదలుతుందా అనుకున్నది. పవిత్రజీవితాన్ని గడిపినా లోకానికి వేశ్యగా వ్యవహరింపబడుతానుగా అనుకున్నది. లోకంతోనూ, దానిమాటలతోనూ తన కేం పని? అనుకు

న్నది. మురళి తనతండ్రి కోరికను నిర్వర్తించడానికి వెళ్ళునపుడు దారిలో తానుండకూడ దనుకున్నది. చంద్రుణ్ణి సలహా అడుగుదామని కిటికీలోనుంచి తొంగి చూసింది ఆకాశంలోకి. అప్పుడే చంద్రుడు కారుమేఘంచాటుకు దొర్లిపోయాడు!

సరోజిని వెనక్కి తిరిగింది. మురళి నిద్రలో ఉన్నాడు. పక్కనే పడిఉన్న ఉత్తరాన్ని తీసి చదివింది. చిత్రపటాన్ని చూసింది కాశ్సేపు. క్షమించమని అచేతనమైన పటాన్ని అడిగింది. కళ్ళకద్దుకుంది పటాన్ని. కన్నీళ్లు తుడుచుకుంది చెంగుతో. నా సర్వస్వం నీకర్పిస్తున్నానంది పటంతో. అంతర్గతమైన ప్రేమను అణచుకొంటున్నానన్నది. కులాన్నిబట్టి అస్పృశ్యతపేర పోయినా, నిష్కల్మషహృదయం, పవిత్రదేహమూ యింతదనుకా అంటబెట్టుకోనివ్వలే—అన్నది. ఇంతవరకూ తను ప్రేమనావ కెట్టి విపత్తూ రాబోదన్నది. వచ్చిన ఒక్కటీ ఊరకే పోదనుకున్నది. నావ మునిగినా నావికుడు తెప్పరిల్లి వేరొక నావను ఏర్పరచుకొంటాడన్నది. మురళి తెచ్చిన పూలతో ఆ పటాన్ని అలంకరించింది కిటికీలో పెట్టి. తన మెడలోవున్న ఒక్క గొలుసూ ఆపటానికే చుట్టింది. మంగళప్రదప్రేమస్వామిని ఆశీర్వదించింది. గోడకున్న తన పటాన్ని తీసి 'నీపని ముగిసింది ప్రపంచంలో' అన్నది. 'వేశ్యాకులంలో జన్మించినా ఆ తుచ్ఛజీవనానికి గురికాకుండా వున్నన్నాళ్లు స్వేచ్ఛగా పవిత్ర జీవితాన్ని గడిపావు' అని సగర్వంగా పలికింది. మురళికేసి చూసింది. కన్నీళ్లు చెక్కిళ్ళమీదుగా జారినై. 'నీమనసు నిర్మలమైన దైనప్పటికీ మన ప్రేమసౌధానికి నిప్పురగుల్కొనే రోజులొచ్చినట్లు నా అంతరాత్మ బోధిస్తున్నది. ఆ దారు

ణాన్ని కన్నులారా చూసేముందే నిష్క్రమిస్తాను. నలదమయంతుల కథ అడ్డంగా తిరుగుతుంది! ఔను—కాని, జీవించినన్నాళ్లు పవిత్రజీవనాన్ని గడిపినందుకు నేను తృప్తిపొందాను. ధన్యను—నిన్నుమటుకూ వీడిపోతున్నందుకు క్షమించు. నావియోగానికై పరితపించవద్దు. ఎలాంటి సాహసమూ తలపెట్టవద్దు. నాపని ముగిసింది ప్రపంచంలో...నీకు చాల పనిఉన్నది. నావలన నీ బాహ్యేంద్రియాలే మైలపడినవి. అంతరింద్రియాల పవిత్రత నే నెరుగుదును: దానికితోడు నీవు పురుషుడవు. లోకంలో మీ రేంచేసినా చెల్లుతుంది. అపవిత్రతకూడా అడ్డం రాదు మీచర్యలకు. మాళీ...! మన ప్రేమశృంఖలం అవిచ్ఛిన్నగాఉండి మనల్ని కట్టివేశిందిన్నాళ్లూ. ఇప్పుడో...? నిమిష నిమిషానికీ తునకలు తునకలుగా పగిలిపోయి చెదిరిపోతున్నది. నా నిష్క్రమణతర్వాత మళ్లీ ఆ తునకల్ని అతికించుకో! పవిత్రప్రేమలో అపవిత్రత తొంగిచూశింది. నేను చూడలేను. నేటివరకూ నేను భుజించిన స్వేచ్ఛాపవిత్రప్రేమఫలాలు చాలు నాజన్మకు—వేశ్యాకులంలో పుట్టిననాకు! మాళీ! నీ ప్రసాదమునకు కృతజ్ఞత. నేను వచ్చే జన్మలో చూపించడానికి తప్పక ప్రయత్నిస్తాను. నీతండ్రికి నీవు సహాయపడడానికై నీదారిలో నేను అడ్డం లేకండా తొలగిపోతున్నాను. నాకిక సెలవు.' అని కన్నీటితో చేతిలో వున్న తన పటాన్ని మాళి పాదాలవద్ద పెట్టింది వణకుతూ!

చీరచెంగు తలమీదకప్పుకుని వెనక్కుచూస్తూ మెల్లగా మాళిని దాటిపోయింది! ఎక్కడికి? కారుమేఘాల చాటున దాక్కున్న చంద్రుణ్ణి కలసి ఆ చల్లనివెలుగులో శాంతిని

పొందాలని, సముద్రుణ్ణి ముందట ప్రార్థించడానికి, అతన్ని కలుస్తే, తర్వాత అతని కొడుకైన చంద్రుణ్ణి కలవడం సులభ మార్గమని సరోజిని ఉద్దేశం! అందుకని ఆరాత్రి బయలు దేరింది సముద్ర సామీప్యానికి! మరి మాళి? నిద్రపోతు న్నాడు!

* * * *

పిల్లి ఏదో చప్పుడు చేస్తే మాళికి మెలకువ వచ్చింది. రాత్రి సరోజిని వెలిగించిన లాంతరు తన నిద్రలో ఎప్పుడో చల్లారింది! పే రొకగు చీకట్లో ఉన్న మాళికి సహాయపడడా నికి దీపం చూపెట్టినా మాళి కిష్టం లేదు. ఆరిపోయిన దీపాన్నే మళ్లీ వెలగించాలని లాంతరుకోసం వెదికాడు. కనుపించలేదు. చీకట్లో వెదకుతూఉంటే లాంతరు కాలికితగిలి పక్కన పగి లింది! 'సరోజినీ' అని పిలిచాడు. జవాబు లేదు. ప్రక్క మీద తట్టాడు, లే దక్కడకూడా. తన కాలి కేదో కాగితం తగిలింది. కిటికీ దగ్గర వెన్నెల వెలుగులో చూశాడు సరో జిని పటం! కిటికీలో పూలగుపించాయి. తాను సరోజిని కోసం తెచ్చిన పూలు! ఏం? సరోజిని పెట్టుకోలేదా? చేత్తో రెండు పూలను తీసుకున్నాడు. కాగితం చేతికి తాకింది. ఏమిటి? ఆ వేళ వుత్తరంతో వచ్చిన పటము. మాళి కర్థం కాలేదు. సరోజిని చర్య వింతగా ఉంది. ఎక్కడికి వెళ్లింది? తన వూరు వెళ్లిపోయిందా? ఛా! ఛా - అలాంటి ఊహ సరోజిని కెప్పుడూ తట్టదు. ఆ జీవితాన్ని గడపవలెనని ఆమె కుంటే తనతో ఇన్నాళ్లూ యెందుకుంటుంది? వేశ్యావృత్తి పైన. అసహ్యత సరోజిని ముఖంగా ఎన్నోసార్లు మాళి విన

లేదూ ? అయితే ఎక్కడికి వెళ్లింది ? మాళికి పిచ్చెత్తినట్లైంది. ఆ యింట్లో యిక ఉండలేకపోయ్యాడు. సరోజినిని కలుసుకోవాలనుకున్నాడు. చివాలున లేచి ఉత్తరీయం మీాదేసుకొని, సరోజిని పటాన్ని గుండెకేసి అదిమిపట్టుకొని, ఏడుస్తూ సముద్రతీరానికి పరుగెత్తాడు మాళి ! ప్రతిదినం సాయంకాలం తీరానికి మాళీ సరోజినులు కలిసివచ్చేవాళ్లు. ఈ దినం, వేరు వేరైనారు ! మాళి వచ్చి సముద్రానికి గజందూరంలో ఉన్న తెప్పకొయ్యల్ని పట్టుకొని విశాలవక్షస్థలంగల సముద్రుడికేసి దీనంగా చూస్తున్నాడు. తల పైకెత్తి చంద్రుణ్ణి చూశాడు. సరోజిని ఆబింబంలో సుఖంగా ఉన్నట్లు అగుపించింది మాళికి! పాపం !...... తనకు కూడా స్థానం ఇవ్వ మని చంద్రుణ్ణి దీనంగా వేడుకున్నాడు. చంద్రుడు తప్పించుకున్నాడు, మేఘాల్లోకి. మళ్లీవచ్చి నవ్వాడు మాళిని చూసి ! సముద్రుడు హుంకరించాడు. మాళి వణకిపోయాడు. ఇసుకల్ని కౌగలించుకున్నాడు. తలత్రిప్పి చుట్టూచూశాడు. పక్కనే ఓ వ్యక్తి కదలిక. ఆనుమానపడ్డాడు. లేచి నుంచున్నాడు. ఏముంది ? — మాళి నీడ ఇసుకలమీాద ! చాలసిగ్గుపడ్డాడు. బట్టలు చూసుకున్నాడు. తడిసినై — సముద్రుని కెరటాలు ఆలోచనలో ఉన్న మాళిని తాకినై. ఏదో జ్ఞాపకానికి వచ్చినట్లుంది. మాళి ఆతురతతో తనచుట్టూ ఇసుకనంతా వెదకుతున్నాడు, కళ్లు తుడుచుకుంటూ. మధ్యమధ్య ఉత్తరీయంతో ఇసుకను త్రవ్వతున్నాడు. కాస్సేపు వెదకిన తర్వాత ఏడ్చాడు. సముద్రుణ్ణి తాకి, కెరటాల్ని కౌగలించుకున్నాడు. సముద్రుడూ పరిత్యజించాడు ! ఒడ్డున తడిబట్టల్లో నిలుచున్నాడు. వెన్నెల్ని పడి

పోతాననే భయంచేత పట్టుకోబోయాడు; సుడిగాలివచ్చి ఇసుకల్లోకి పడేసిం దాతన్ని. కళ్లల్లో ఇసుక పడింది. అల్లాగే తెరిపి చేసుకొని చంద్రుడివైపు చూశాడు. కారుమేఘాల కౌగిట్లో కరగిపోయినాడు కువలయబాంధవుడు. నిరాశతో నిట్టూర్పు విడిచాడు—మాళి లేచి కూచోడానికి ప్రయత్నించాడు. స్వశక్తి చాలలేదు. రెండు చేతులూ ముఖంమీద పెట్టుకొని ఏడ్చాడు. ఇసుకల్లో పొర్లాడాడు. సముద్రుణ్ణి తాకాడు. సముద్రుడేదో మాళి చెవిలో మంత్రోపదేశము చేశాడు. తత్ఫలితంగా మాళి లేవబోయాడు. ఎడం చేతికి కాగితం తగిలింది! లేచి దాన్ని తీసుకున్నాడు. ఏమి టా కాగితం? — తన ప్రేమభాగ — తన సర్వస్వమైన సరోజిని పటం! తడిసింది — మాళి తీయబోతుంటే చినిగిందికూడా! మాళి నిశ్చలంగా నిలుచున్నాడు సముద్రుడి కెదురుగా! 'మా రహస్యాల్ని విన్నావుగా, మాలో ప్రేమ నీకు తెలుసుగా, సరోజినితో నన్ను కలపవూ?' అని మాళి సముద్రుడితో అన్నాడు. సముద్రుడు కాఠిన్యంతో కరగి నీరైనాడు! మాళి శంఖాన్ని చూడలేకపోయాడు చంద్రుడు. తీరంమీద నిలుచున్న చెట్లు తలలువంచుకున్నై. దూరాన్నున్న దీపస్తంభంలో దీపం మాటిమాటికీ ఆరిపోతూ మాళి ఆశాజ్యోతిని అనుసరిస్తున్నట్లుంది! సముద్రంలోకి నడుస్తూ మాళి సరోజినిపటాన్ని చూస్తూ ఆగాడు కాస్సేపు:

'వేశ్యావృత్తిని అసహ్యించుకొని సరోజిని నా అండ చేరింది. మళ్ళీ నేను వేరొక కన్యను చూస్తానా? అలాగైతే నేను మళ్ళీ వేశ్యావృత్తికి దారితీసినవాణ్ణవుతాను... ఛీ.

...నా సరోజినికి నీడ యిచ్చి, ఆమె సిద్ధాంతాన్ని పొగడిన నేను ఆమె తర్వాత ఆ సిద్ధాంతాన్ని త్రోసివేస్తానా?......నీచం......అంతకన్న ద్రోహం వేరే ఉండదు. ఏసిద్ధాంతం కోసం, ఏనీతికోసం, ఏపవిత్రతకోసము స్వస్థానాన్ని, బాంధవ్యుల్ని, సర్వస్వాన్నివిడిచి నాకు తన జీవితాన్ని అర్పణ గావించిందో, అన్నీతిని, ఆసిద్ధాంతాన్ని, అపవిత్రతను, ఆమెతర్వాత నేను నిలబెట్టకపోతేనా ప్రయోజకత్వ మేమిటి? నా విశిష్టతయేమిటి? నా అనురాగ మేమిటి?.........పశువులకీ మనుష్యులకీ భేదంలేదూ? పూర్వం సహగమన ముండేది. భర్త చావంగానే భార్య ఆ చితిమీదే ఎక్కేది. మొదట దాని అర్థమేమిటి. చివరి కెలా పరిణమించిందో......అది విధిగా మారింది. బలవంతం చెయ్యాల్సి వచ్చిందికూడా. అసలు, అర్థం? హృదయంలో పుట్టిన సహజప్రేమను స్వీకరించేవస్తువు అంతరించినపుడు హృదయముండి ఏమిప్రయోజనం? హృదయంగల శరీరముమాత్ర మెందుకు? ఈలాంటి అర్థంవల్ల సహగమనం స్త్రీకేకాదు, పురుషులుకూడా అనుసరించవలసిన్నదే! వియోగం సహగమనానికి పురికొల్పేది. విధియొక్క నిర్బంధం కాదు. వియోగం, అనురాగం స్త్రీకేనా? పురుషుల్లో మటుకూ లేవూ? ప్రేమోచ్ఛిష్టాన్ని స్వీకరించడంలోగాని, అనుభవించడంలోగాని ఉన్న నైచ్యం, అపవిత్రత, హేయతా వేరెక్కడా లేవని తెలుసుకోవాలి ప్రపంచం......! సరోజినీ! నీవు పవిత్రురాలవు, నీ వలన నేను, నన్ను చంచలహృదయుణ్ణిగా భావించావు. బహిరంగంగా వివాహం చేసుకోలేదని దిగులొందావు, ఏమి

చేసుకోకపోతే? పుస్తెకట్టినంత మాత్రాన లేని ప్రేమను రమ్మనమంటే వస్తుందా? పవిత్ర ప్రేమ జీవులకు బాహ్య చిహ్నాలతో పనిలేదు. ఇహంలో కాకపోయినా పరంలో నైనా పవిత్రప్రేమ కొనియాడబడుతుంది ...... సరోజినీ నన్ను నీ దరికితీసుకో ...... ఈ లోకంలో వద్దు - ఈ లోకంలో వద్దు...... పరలోకంలో సుఖంగా ఉందాం!'

సముద్రుడు దుఃఖిస్తూన్న మాలిని తన కౌగిట్లో అదుముకున్నాడు!

* * * *

తీరంమీాద సుడిగాలి బయలుదేరింది. సముద్రుడు పెద్ద రొదతో దుఃఖిస్తున్నాడు. నురుగులుకూడా కక్కుతున్నాడు, మేఘాలు కళ్లు మూసుకున్నై. చంద్రుడే మూల ఉన్నాడో అగుపించలేదు. దీపస్తంభంలో దీపం కాస్తా ఆరిపోయింది. దూరంగా సముద్రంలో ఒక ఓడ ఉన్నట్లు అగుపించింది. చూస్తూ ఉంటూఉండగానే మినుకుమినుకుమంటూన్న ఓడలో దీపాలు మాయమైపోయినాయి! ఆ తుపానులో ఆ ఓడ ఏమైపోయిందో భగవంతుడికే తెలియాలి!



లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి.

# సంస్కృతి

అది వేసంగి. కృష్ణానదే మాకు సముద్రం లాగ ఉండేది. అంటే, సముద్రతీరానికి వెళ్లి హాయిగా ఆ చల్లగాలుల్లో తిరిగి ఆనందించే అదృష్టం లేకపోయినా కృష్ణాతీరమే మాకా హాయినీ, ఆనందాన్ని ప్రసాదిస్తూ ఉండేది. ఆ యిసుకల్లో కూచుని నదిలోకి చూస్తూఉంటే, చుట్టూఉన్న ప్రపంచాన్నే మరచిపోతూ ఉండేవాణ్ణి. నిజంగా మనస్సులో ఏవిధమైన ఆందోళన, చిరాకు కల్గినా, నదీ తీరానికే వెళ్లి ఆ తెల్లని యిసుకతిన్నెలమీద కూచుని కృష్ణానదిమీదనుంచి వచ్చే నిర్మలమైన గాలుల్లో ఆడుకునే సరికి అన్నీ మాయమై పొయ్యేవి. ప్రకృతిలో ఇంత ప్రభావం ఉందికదా అనుకునే వాణ్ణి. నిత్యమూ కృష్ణా తీరానికే వెళ్లుతూ సాయంకాల మంతా అక్కడే గడిపేవాణ్ణి నేను.

ఒకనాడు సాయంకాలం మామూలుగా నేను వెళ్లి ఇసుకల్లో కూచుని వెంటతెచ్చుకున్న వైతాళికుల్లోకి చూస్తున్నా, సామాన్యంగా ఎవ్వరూ రానిచోటే చూసుకుని కూచునే వాణ్ణి. ఆదినం ఎవరో నదిలో స్నానంచేసి మంత్రాలు గావల్ను చదువుతున్నాడక్కడే. అతనెప్పుడు వచ్చాడో నే నెరగను. నా ధోరణిలో నేనున్నా. తలెత్తి యెందుకో చూసేసరికి ఇతడు అగుపించాడు. చాల ముసలివాడు. చేతికర్రా రెండు పొడిబట్టలూ ఇసుకలమీదపెట్టి ఉన్నై. మోకాళ్ళ లోతుకువెళ్లి స్నానంచేసి అప్పుడే బయటికి రాబోతున్నాడు. ఆ వణుకుతూన్న చేతుల్లో ఊతకర్రను

అందుకోబోయినాడు. పాపం, ఆ వ్యక్తిని చూసేటప్పటికి నాకు జాలి కలిగింది. సమీపానికి వెళ్ళాను. అక్కడ ఉన్న కర్రను చేతికిచ్చాను. వణుకుతూ అందుకుని 'నాయనా ! ఎవరిపిల్లవాడివి నాయనానువ్వు ?' అన్నాడు, అంగవస్త్రాన్ని బుజాన వేసుకుంటూ, 'వణకి పోతున్నావు' ముందు పొడి బట్టలు కట్టుకో తాతా ! అన్నాను. కట్టుకుని యివతలికి వచ్చాడు.

ఇద్దరము ఇసుకలో కూచున్నాము. చల్లని గాలులు మా మీదుగా పోతున్నై. ముసలి బ్రాహ్మడు పాపమింకా వణుకుతునే ఉన్నాడు. పైన ఉత్తరీయం కప్పుకుని ముడుచుకుని కూచున్నాడు. 'తాతా ! వక్కడివే వచ్చావు. పెద్దవాడివి. తోడెవ్వరినైనా తీసుకురాకపోయావా ?' అన్నాను. నాయనా ! తోడువచ్చేవాళ్లు నాతోనే వచ్చారు, అన్నాడు కన్నీళ్లతో. ఏమిటో నా కర్థము కాలేదు. అడిగి తెలుసుకుందామని, 'నీమాట లర్థంకాలేదు తాతా. ఎందుకు కళ్ల నీళ్లు పెట్టుకుంటావు ?' అన్నాను. 'అబ్బాయి—నువ్వు చిన్నవాడివి. నీకు చెప్పినా అర్థంకావు. ఎందుకులే నాయనా నా గొడవ ? ఇంతవరకు ప్రాణాల్ని నిలుపుకున్నవాణ్ణి బ్రతకలేక పోతానా ?' అన్నాడు. అతని మాటలు వింటూంటే ఏదోవిధమైన జాలికలిగి అతని విషయం పూర్తిగా తెలుసుకోవాలని అనిపించింది. అందుకని 'తాతా ! ఏమిటి నీ స్థితి ? మనస్సులో విచారం ఎవరితోనైనా చెప్పుకుంటే సగం తగ్గుతుందంటారు. కనుక ఏమిటో చెప్పు' అని వేడుకున్నాను. పాపం అతనికూడా నామీద ఒకవిధమైన ప్రేమ కలిగింది

కాబోలు చేతిలో కర్రను కిందపెట్టి కళ్లు తుడుచుకుని చెప్ప డం ఆరంభించాడు.

కాశ్మీరపు గాలి స్తంభించింది. దినకరుణ్ణి మేఘాలు వచ్చి కప్పేసినై. ఒక్క నిమిషం ఇద్దరము నిశ్శబ్దంగా కూచు న్నాము.—వింటానికి కుతూహలంతో నేనూ- చెప్పడానికి ప్రయత్నిస్తున్న ముసలి బ్రాహ్మడూ. 'నాయనా—' మొదలెట్టాడు. "ముసలితనం వచ్చేదాకా బ్రతకకూడదు తండ్రీ! పరులకైనా ఈకష్టాలు రాకూడదు". "ఏం కష్టాలు తాతా?" అని అడ్డగించాను. "ముసలితనంలో 'తనవారు' అనేవాళ్ళు లేనప్పుడు మనిషి జీవించి ఏమిచేయడానికి నాయనా? ముందు దాటిపోవలసినవాణ్ణి నేను బ్రతికుండి ప్రపంచ ఫలాన్ని ఆరగించవలసిన చిన్నవాళ్లు నాముందే దాటిపోతే?— ఇంతకన్న కష్టమేమిటి నాయనా." వింటూంటే ప్రపంచ సూత్రాల్ని బోధించడానికి వచ్చాడేమో అనిపించింది. ఆగ కుండా చెప్పుకెళుతున్నాడు. "ఇంతకన్నా కష్టముండబోదు. వాళ్ల చేతులమీదుగా దాటిపోవాల్సిన వాణ్ణి నే నిలాగు న్నాను. వాళ్లనికాస్తా ఈ కృష్ణ—ఈ దిక్కుమాలిన కృష్ణ— ఎక్కడ దాపరించిందోకాని—పొట్టపెట్టుకుంది." చివరిమాటలకు నాకుకష్టంవేసింది. నాప్రాణాలన్నీ అమాంతంగా నాలోనుంచి లాగివేసినట్లు అనిపించింది. ఒక్క నిట్టూర్పు విడిచాను. అంత వరకు ఎంతో ఆనందాన్ని చేకూరుస్తున్న కృష్ణను తిట్టేసరికి నిజంగా నిలువునా నీరైపోయింది నా హృదయం, నా కళ్లు. తెరచివున్న పుస్తకంలోకి చూసినై అమాంతంగా. 'అశాంతి' అనే శీర్షిక కనబడింది! ఒక్కమాటు కళ్లు మూసుకున్నా

అశాంతి మరింత రేకెత్తింది. తరువాత దీనంగా 'తాతా! కృష్ణను తిట్టవద్దు' అన్నాను. మళ్లీ నాకే జాలివేసింది. నిజానికి అంత తెలియకుండా కృష్ణ వాళ్ళను మింగిందా? అని అనుమాన మేసింది. అయినా ఎలా సంభవించిందో కనుక్కుందా మనుకున్నాను. వెంటనే అడిగాను. కృష్ణానది వింటూనే ఉంది మా సంభాషణ!

"నాయనా! ప్రపంచములో ఎంతోమంది పుట్టున్నారు. పోతున్నారు. వాళ్ళల్లో ఎంతోమంది బ్రతికివుంటే, గొప్ప కార్యాల్ని నెరవేర్చి ప్రపంచంలో పేరుపొందే శక్తిగల వాళ్లున్నారు. గొప్ప కవులు, చిత్రకారులు, శిల్పులు, నటకులు కాదగిన వాళ్ళున్నారు. ఏం లాభం? మృత్యువుచే పాలింపబడిన వాళ్లుగదా వాళ్లు! చిన్నతనంలోనే మృత్యువు నోటబడిన వాళ్ళను అసలు ఆ పరమాత్ముడు పుట్టించకపోతే నేమి? ఇంతకు చేసుకుంది మేము!"

నడుము వాల్చాడు పాపం. నాకేదోవిధమైన అభిలాష కలిగింది అతనిపైన. అనిర్వచనీయమైన ప్రేమా, కరుణా ఉద్భవించినై. వేదాంతం అతనిలో మూర్తీభవించిందేమో అనుకున్నా. ప్రపంచానుభవం కలవాడు కాబట్టి అతని మూలకంగా అన్ని విషయాలూ నేర్చుకోవచ్చుగదా అని ఆశ కలిగింది. మరింత జాగ్రత్తగా వింటున్నాను.

"నాయనా, మా ఊరు ఈ యేటి అవతల నాలుగామడ దూరంలో వుంది. ఈ ఊళ్ళో నాక్కావాల్సిన వాళ్లుంటే నాకు పిల్లలులేని కారణాన పెంపుతీసుకున్నా మా మాధవయ్యను. చుట్టాలమే అన్నమాటగాని వాళ్ళకూ మాకూ

రాకపోక లాట్టే లేవు. అప్పుడు మనం కూచున్న ఈ స్థలం ఒక లంక. ఏనాది గుడిసెలతో నిండివున్న ప్రదేశం ఇది.— నువ్వు చిన్నవాడివి నాయనా. నీ వెరగవు. నా పాలం ఉన్నంతవరకూ ప్రతివాళ్ళూ చుట్టుకునేవాళ్లు. మా మాధవయ్య మటుకూ యీ పట్నంలోనే ఉండేవాడు చదువు కుంటూ" అని చెప్పి కన్నీళ్ళు కార్చాడు. ఇప్పు డెక్క డున్నాడు మాధవయ్యా?' అన్నా చెప్పినసంగతి మరచి పోయి. "ఏట్లో ఉన్నాడు." అని జవాబిచ్చాడు వంచిన తలెత్తకుండానే. ఒక మాటు చెప్పినాడుగదా అని జ్ఞాపకం తెచ్చుకుని నన్ను నేనే అడిగినందుకు కోపగించుకున్నాను. తరువాత తాతా! "ఎలా జరిగిం దీ ఘోరం?" అని అడిగా. ముక్కు తుడుచుకుంటూ ఆ అంగవస్త్రంతోనే కళ్లు తుడుచు కుంటూ మొదలెట్టాడు.

"అదో గాథ నాయినా. కంచె కదిలిస్తే డొంకంతా కదులుతుంది." పరవాలేదు చెప్పమన్నాను. కాస్త ఓపిక తెచ్చుకుని మొదలెట్టాడు చెప్పడానికి! "మా మాధవయ్య మేనకోడలు, మాలతి, ఇక్కడుండే యేనాదిగుడిసెల్లో పెరి గింది." "అదేమిటి తాతా—మీరు బ్రాహ్మలు కాదూ?' అనుమానంగా అడిగా. "విను నాయినా సాంతంగా" అన్నాడు. సరే నన్నట్లుగా తల ఊపాను. మాలతి తండ్రి రాజాస్థాన పురోహితుడు. ఆ అమ్మాయి తల్లిదండ్రుల తద నంతరం రాజులవద్దనే పెరిగింది. పానకాలనే యేనాది వాడు ఆ రాజుల దగ్గర తన యేనాది బలగంతో అండగా ఉండే వాడు. ఆశ్రయించిన రాజవంశం నశించింది. అప్పుడు

మాలతి పానకాలు చేతిలో పడింది. అప్పటికి మాలతి చిన్న పిల్ల. ఈ పిల్లసంగతి కనుక్కునేవాళ్లే లేకపోయినారు. ఈ పట్నంలో మాధవయ్య చదువుకుంటున్నప్పటికీ తెలియదీ సంగతి. ఓనాడు తిరణాలేదో యీ పట్నంలో జరుగుతూ ఉంటే మాలతి పానకాలుతో పట్నానికి వచ్చింది. ఆ తిర ణాలలో మారుపడి రాత్రికావడంచేత మాధవుడి యింటి అరుగుమీద ఏడుస్తూ పడుకుందిట. అప్పుడు మావాడు చూసి లోపలికి తీసికెళ్ళాడు. మరునాడు మావాడి అక్క కనుక్కుంది మాలతిని. ఏదో పనిమీద నేనాడినమే రావ డం తటస్థించిందీ పట్నం. మా నాడింట్లో లేడు. వాడి అక్క వల్ల అంతా విన్నాను. కృతజ్ఞత చూపడానికి మావాడు మాలతితో యేనాది గుడిసెలకు పానకాలకోస రం వెళ్ళాట్ట. కృష్ణానదిమీద ప్రయాణం చేస్తూ ఉండగా తుపాను వచ్చి వీళ్లున్న పడవను కాస్తా ఎటువైపుకో కొట్టే సింది. నేనెళ్లి చూస్తునుగదా పడవా లేదు. ఆయానాది పల్లే మునిగి పోయింది! ఇంకేముంది? కృష్ణ—దాని కెదు రుగ్గా నేనూ మిగిలాం. నా దురదృష్టం చేత పొలమంతా పోయింది నేను ముసలి వాణ్ణయ్యాను. కాచిపోసే దిక్కు లేక పోయింది. ఉన్నన్నాళ్లూ తిన్నవాళ్ళు నా వైపు తిరిగైన చూడలేదు. ఎవ్వరూ దరిజేర నీయలేదు. ఈ నాటికి నేను కూడా భిక్షుకుడనుగా వ్యవహరింప బడుతున్నా పట్నపు వీధుల్లో. ఏంచేస్తాము నాయనా తలచుకుంటే కడుపు తరక్కు పోతుంది. కాలప్రభావం నాయనా! ఉన్న భాగ్యం అంత రించింది. బంధుజాలం బహిష్కరించారు. ప్రపంచానికి

విరోధుణ్ణయి పోయాను. నేను భిక్షాటనకూడా బయలు దేరడం మూలాన ఎరగని ప్రతివానికీ శత్రువౌతున్నాను. కర్మఫలాలు అవశ్య భోక్తవ్యాలు నాయనా! మా మాధవుడు బ్రతకకూడదూ!" అని ముఖాన గుడ్డ అడ్డముంచుకొని ఏడ్చాడు పాపం.........నాకు జాలివేసింది. 'ఏడవకు తాతా' అని బ్రతిమాలాను. ప్రయోజనం లేకపోయింది.

ఇప్పుడాతడు అనాథుడు గదా. అనాథుడు గదా పాపం వీధుల్లోవున్న భిక్షకుల్లో యితడొకడుకదా! భిక్షకుణ్ణి ఎవరైనా రానిస్తారా? గాధల్ని అడిగేందుకు కుతూహలం ఉంటుందా? నిజానికి మనకు కనబడే ప్రతివస్తువుకీ ప్రపంచంలో ఫలాన్ని ఎంతవరకు కారగించాలో కనుక్కోగలమా!

నా మనసులో అశాంతి రేకెత్తింది. కుళ్ళికుళ్ళి ఏడుస్తున్న ఆతన్ని ఏమనేందుకూ తోచలేదు. వైతాళికుల్లోకి చూశాను కవుల్ని సలహా అడుగుదామన్నట్టుగా!

"స్వంత లాభం కొంత మానుకు
పొరుగు వారికి తోడుపడవోయ్!
దేశమంటే మట్టికాదోయ్,
దేశమంటే మనుషులోయ్!"

అన్న పాదాలు కనుపించినై. లేస్తూ ఉన్న ముసలి బ్రాహ్మణ్ణి అనుకరించా నేనుకూడా. మాట్లాడకుండానే ఊళ్ళోదాకా వెళ్ళాం, "కనిపెట్టి ఉండు నాయనా నాలాటివాళ్ళను." అన్నాడు దీనంగా ముసలి బ్రాహ్మడు. నాకు నోటివెంబడి మాటలు రాలా. కళ్ళలో ఒక్కమాటు నీళ్ళు గిర్రున తిరిగినై.

జేబులో చెయ్యేసి ఉన్న రెండు రాగినాణాల్నీ యిచ్చాను. వెళ్ళేదాకా అక్కడే నిలుచున్నా......!

కాస్సేపటికి నన్ను నేను జ్ఞప్తికి తెచ్చుకుని కళ్ళు తుడుచుకుని యింటికి వచ్చేశాను.

తలుచుకున్నప్పుడల్లా పాపమా వృద్ధబ్రాహ్మడి విషాద రహస్యవచనాల్ని నా చెవులింకా వింటూనే ఉన్నట్టు తోస్తుంది. ఇప్పటికీ కృష్ణాతీరానికి వెళ్ళినప్పుడంతా ఆ ప్రదేశం నా హృదయాన్ని కరిగిస్తూ ఉంటుంది. కన్నీటితో తర్పణం విడుస్తూ ఉంటా ఆ బ్రాహ్మణ్ణి తలుచుకుంటూ!



